ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు

# ఫాతిమా షేక్



సయ్యద్ నశీర్ అహమ్మద్

ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు

# ఫాతిమా షేక్


సయ్యద్ నశీర్ అహమ్మద్



ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్

ఉండవల్లి - 522 501

**ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్**

(THE FIRST MUSLIM LADY TEACHER OF MODERN INDIA : FATHIMA SHAIK)


## సయ్యద్ నశీర్ అహమ్మద్

## Syed Naseer Ahamed





ప్రచురణ సంఖ్య : 24

ముద్రణ : 2021

ముఖచిత్రాలంకరణ : యన్.జయరాజు, వినుకొండ.

టైపు సెట్టింగ్ : జయదీప్తి గ్రాఫిక్స్, వినుకొండ.

ముద్రణ : జయదీప్తి గ్రాఫిక్స్, వినుకొండ.

**ప్రతులకు :**

## ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్

ఫ్లాట్ నం. సి-2, శ్రీరామ్స్ ఆర్కేడ్, అమరావతి రోడ్,

**ఉండవల్లి - 522 501,**

తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్

దూరవాణి: + 91 9440241727

Mail:

naseerahamedsyed@gmail.com

**వెల : 50-00**

**ఆ**ర్ధిక-సామాజిక అంతరాలు లేని

సామ్యవాద వ్యవస్థ లక్ష్యంగా

అహర్నిశలు శ్రమించిన

**మా పెదనాన్న**



**షేక్ కాలేషా**

(1928-1998)

గారికి

**అంకితం**

**షేక్ కాలేషా :** 'కమ్యూనిస్టు కాలేషా'గా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నెల్లూరు జిల్లా కావలి ప్రాంత ప్రజలకు సుపరిచితులైన షేక్ కాలేషా నెల్లూరు జిల్లా కుడితిపాలెం గ్రామంలో షేక్ బడేబీ, షేక్ ఖాదర్ సాహెబ్‌లకు 1928 జూలై 11న జన్మించారు. బాల్యం నెల్లూరు జిల్లా ఊటుకూరు, కంచరపాలెంలో సాగింది. చిన్నవయస్సులోనే బెజవాడ గోపాల రెడ్డి, పుచ్చలపల్లి సుందరయ్యల పరిచయంతో భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. ఆర్థిక-సామాజిక అంతరాలు లేని సామ్యవాద వ్యవస్థ పట్ల ఆకర్షితులైన ఆయన పదహారు ఏండ్ల వయస్సులో కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా (సి.పి.ఐ)లో ప్రవేశించారు. తన మేనమామ కావలికి చెందిన షేక్ నన్నె సాహెబ్-షేక్ ఖతిజాబీల ద్వితీయ కుమార్తె షేక్ రొఖయాబిని వివాహమాడారు. మాతృభూమికి స్వాతంత్ర్యం సిద్ధించాక సి.పి.ఐ నాయకునిగా ప్రజల సమస్యల మీద సాగిన పోరాటాలలో పాల్గొని పలుమార్లు జైళ్ళ పాలయ్యారు. ఆ తరువాత సి.పి.యం, విప్లవకర రాజకీయాల పట్ల మొగ్గు చూపిన ఆయన ప్రభుత్వ ఆంక్షలకు, విధి-నిషేధాలకు, అరెస్టులకు గురయ్యారు. పలుమార్లు జైలు పాలయ్యారు. ఆ తరువాత సి.పి.యం పార్టీలో పునఃప్రవేశించి ప్రజా సమస్యల పరిష్కారం కోసం అహర్నిశలు కృషి సల్పుతూ ప్రజాభిమానాన్ని చూరగొన్నారు. చరమాంకం వరకు ప్రజల సంక్షేమం అభివృద్ధికి కృషి చేస్తూ ఆపన్నులకు సహాయ హస్తం అందిస్తూ గడిపారు. చిట్టచివరి వరకు కూడా ప్రజాసేవలో నిర్విరామంగా గడుపుతూ 'కమ్యూనిస్టు కాలేషా'గా నెల్లూరు జిల్లా ప్రజల ప్రేమాభిమానాలను సొంతం చేసుకున్న షేక్ కాలేషా 1998 జూలై 13న నెల్లూరు జిల్లా నెల్లూరు పట్టణంలో కన్నుమూసారు. ◆




**సయ్యద్ నశీర్ అహమ్మద్**

ఉండవల్లి
తాడేపల్లి మండలం,
గుంటూరు జిల్లా
ఆంధ్రప్రదేశ్.


# స్వగతం

'ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు'గా ఖ్యాతిగాంచిన ఫాతిమా షేక్' గురించి రాయాలని చాలాకాలం నుండి మనస్సులో అనుకుంటూ వచ్చాను. ఆమెకు సంబంధించిన సమాచారం సేకరణకు ఆరంభించాను. గత సంవత్సరం పుస్తకం రాయడానికి ఉపక్రమించాను. ప్రతికూల అభిప్రాయాలు, సమాచార సేకరణలో ఎదురైన సంక్లిష్ట పరిస్థితుల వలన ఆ ప్రయత్నం అప్పట్లో విరమించుకున్నాను.

ఆ తరువాత 2020 ఆగస్టులో రాయాలనుకున్నాను. సమాచారం కోసం తిరిగి వెతుకులాట ఆరంభించాను. మహాత్మా జోతిరావు ఫూలే, ఆయన సతీమణి సావిత్రీబాయి ఫూలే మీద వెలువడిన పలు గ్రంథాలను సేకరించుకుని అన్వేషణ-అధ్యయనం ఆరంభించాను. ఆశ్చర్యం ! మహాత్మా జోతిరావు ఫూలే, సావిత్రీబాయిలతో కలసి పనిచేసిన ఫాతిమా షేక్ ఆధారాల సహిత ప్రస్తావనలు పెద్దగా కన్పించలేదు. బాగా నిరాశకు గురయ్యాను.

ఆ నిరాశాజనక వాతావరణంలో కూడా ఏమాత్రం వెనుకడుగు వేయకూడదని నిర్ణయించుకుని పట్టుదలతో ముందుకు సాగాను. 'ఆధునిక భారత తొలి ముస్లిం ప్రధానోపాధ్యాయురాలు'గా కూడా ఖ్యాతిగాంచిన ఫాతిమా షేక్ గురించి నాకు లభించినంత సమాచారానికి అక్షర రూపం కల్పించి తెలుగు పాఠకులకు సమర్పించాలని అనుకున్నాను. ఆ ప్రయత్నంలో భాగంగా గూగులమ్మను ఆశ్రయించాను. మహారాష్ట్రలోని పలువురు ప్రముఖ రచయితలతో, చరిత్ర పండితులతో, చరిత్ర పరిశోధకులతో, మిత్రులతో చాలా విస్తృతంగా సంభాషించాను. ఆ విధంగా రాబట్టిన ఉర్దూ, మరాఠి గ్రంథాలు, దస్త్రాలలోని సమాచారాన్ని, మహారాష్ట్రలోని వివిధ పత్రికల్లో వెలువడిన పలు వ్యాసాలను తెప్పించుకుని మిత్రుల

సహకారంతో నేను ఎరిగిన తెలుగు, హిందీ, ఆంగ్ల భాషల్లోకి అనువదించుకున్నాను. అంతర్జాలం, సామాజిక ప్రసార మాధ్యమాలను కూడా ఆశ్రయించాను. సామాజిక ప్రసార మాధ్యమాల ద్వారా ప్రజల్లోకి వచ్చి చేరిన పలు వ్యాసాలను, ప్రసారానికి నోచుకున్న పలు వీడియోలను సేకరించుకుని క్షుణ్ణంగా అధ్యయనం చేశాను. ఆ విధంగా సమకూర్చుకున్న సమాచారంతో ఫాతిమా షేక్ మీద ఈ పుస్తకాన్ని నాలుగు మాసాల కాలంలో (అక్టోబర్ 2020 – జనవరి 2021) రూపొందించాను.

పందొమ్మిదవ అర్ధ శతాబ్దం ఆరంభ కాలంలో 'విద్య'ను సార్వజనీనం చేయడానికి ఉద్యమించి తమదంటూ ఒక ప్రత్యేక చరిత్ర సృష్టించుకున్న పూలే దంపతుల చరిత్ర కూడా ఇరవయ్యో శతాబ్దం ఆంరంభంలో గాని సమగ్ర నమోదుకు నోచుకోలేదు. 1841 ప్రాంతంలో జోతిరావు పూలే తండ్రి గోవిందరావు పూలేకు నచ్చజెప్పి పూలేను తిరిగి పాఠశాలకు పంప గలిగిన మున్షీ గఫార్ బేగ్, ఫూలే దంపతుల సంస్కరణలను ఇష్టపడని పూలే తండ్రి గోవిందరావు పూలే దంపతులను తన ఇంటి నుండి వెళ్ళగొట్టినప్పుడు ఆ ఇరువురికి ఆశ్రయం ఇచ్చి ఆదుకున్న ఉస్మాన్ షేక్, అతిశూద్ర–శూద్ర సామాజిక వర్గాలకు ప్రధానంగా బాలికలకు విద్యాబోధన చేయడానికి పూనుకున్న పూలే దంపతులతో కలసి పనిచేసిన ఫాతిమా షేక్ లాంటి ప్రాధాన్యత గల వ్యక్తుల చరిత్ర కూడా ఏ కారణంగానో పూలే దంపతుల చరిత్ర సరసన తగినంత స్థానం పొందలేదు. ఆ కారణంగా ఫాతిమా షేక్ తోపాటుగా మిగిలిన ప్రముఖుల చరిత్ర కనబడకుండా పోయింది.

మహాత్మా జోతిరావు పూలే దంపతుల చరిత్ర వెలుగు లోకి రావడం ప్రారంభం అయ్యాక ఫాతిమా షేక్ ప్రస్తావనలు కూడా అక్కడక్కడా చోటు చేసుకోవడం ఆరంభం అయ్యింది. అంతర్జాలం, సామాజిక ప్రసార మాధ్యమాల ప్రచార ఉధృతం పెరిగిన తరువాత మున్షీ గఫ్ఫార్ బేగ్, ఉస్మాన్ షేక్, ఫాతిమా షేక్‌ల చరిత్రలు సంచారవాణి ద్వారా చక్కర్లు కొట్టడం మొదలు అయ్యింది. ఆ కారణంగా ఆ మహానీయుల చరిత్రలు, సేవా–సంస్కరణ కార్యక్రమాల వివరాలు తెలుసుకోవాలన్న ఆసక్తి ప్రజలలో పెరిగింది. ప్రజలలో పెరిగిన ఆసక్తి వలన అరకొరగా లభ్యమయిన ఆధారాలతో, సమాచారంతో మహారాష్ట్రకు చెందిన పలువురు చరిత్రకారులు, ఉద్యమకారులు, సత్యశోధకులు జరుపుతున్న అన్వేషణల ఫలితంగా రూపొందుతున్న గ్రంథాలు, చిరుపొత్తాలు, వ్యాసాలు, సమీక్షలు, విశ్లేషణలు, వీడియోల వలన పూలే దంపతుల విశేషాలతోపాటుగా ఫాతిమా షేక్ వివరాలు వెలుగులోకి వచ్చాయి.

ఆ విధంగా వెల్లడవుతున్న సమాచారంతో మహాత్మా జోతిరావు పూలే సాగించిన సామాజికోద్యమంలో తనదైన విశిష్ట పాత్రను నిర్వహించిన 'ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్' ను తెలుగు పాఠకులకు పరిచయం చేయాలన్న తలంపుతో ఈ గ్రంథ రచనకు పూనుకున్నాను. ఆ కారణంగా ఈ రచన సమగ్రం, సంపూర్ణం అనలేకున్నాను. ఏ చరిత్ర రచన కూడా సమగ్రం, సంపూర్ణం అయ్యే అవకాశం లేదు. ఆయా రచనలు చేస్తున్న రచయితకు తాను చేపట్టిన విషయం సంపూర్ణం, సమగ్రం అన్పించవచ్చు. గతంలో నేను చేసిన రచనలలో నా వరకు నేను సంపూర్ణం, సమగ్రమని భావించినవీ ఉన్నాయి. ఆ రచనలకు భిన్నంగా ప్రస్తుత రచన అసంపూర్ణ సమాచారంతో ఆరంభమయ్యి అసమగ్రంగా ముగిసినందున ఈ పుస్తకంలోని సమాచారం సమగ్రం, సంపూర్ణం కాదని ఇది సశేషం మాత్రమేనని సవినయంగా ప్రకటిస్తున్నాను.

ఈ పుస్తక ప్రచురణకు నేను పూనుకోగానే నా సోదరుడు షేక్ జమీర్ బాషా (ప్రస్తుతం ఉద్యోగరీత్యా కెనడాలో ఉన్నారు) ఆర్థిక చేయూత అందిస్తూ ముందుకు సాగమన్నారు. ఆ ప్రోత్సాహం తోపాటుగా మిత్రులు షేక్ అతావుల్లా నిజాముద్దీన్ (జంపని, గుంటూరు జిల్లా) నేనున్నా నేనున్నా అంటూ ముందుకు వచ్చి ఆర్థిక సహకారం అందించారు. ఆ క్రమంలో నా పుస్తక ప్రచురణకు పలుమార్లు సహకరించిన సోదరులు శ్రీ జవహర్ అలీ (ప్రముఖ న్యాయవాది, కాకినాడ), శ్రీ ఉల్లం శేషగిరి రావు (ప్రముఖ హైకోర్టు న్యాయవాది, సత్తెనపల్లి, గుంటూరు), శ్రీ షేక్ మునీర్ అహమ్మద్ (విజయవాడ, కృష్ణా జిల్లా) ఈసారి కూడా సహాయం అందించినందుకు మప్పిదాలు. 'ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్' పుస్తక ప్రచురణకు మీరేమైనా సహాయం చేయగలరా, అంటూ సామాజిక మాధ్యమం ద్వారా చిన్న సందేశం పంపగానే ఎంతో సంతోషంగా ముందు కొచ్చిన SEEMANDHRA MUSLIM WELFARE ASSOCIATION (SAMWA), SANTI SANDESHAM WELFARE SOCIETY (SSWS) బాధ్యులకు ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

'ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్' రచనకు పరిచయ వాక్యం రాసిచ్చిన డాక్టర్ వినోదిని మాదాసు (యోగి వేమన విశ్వవిద్యాలయం, కడప) గారికి నా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. ఈ పుస్తకం కథానాయిక ఫాతిమా షేక్ చిత్రానికి రూపకల్పన చేయడానికి ఆధార చిత్రాలు అందించిన మహారాష్ట్ర మిత్రులకు,

ఆ ఆధార చిత్రం ఆధారంగా ప్రత్యేకంగా చిత్రాన్ని రూపకల్పన చేసి అందించిన ప్రముఖ చిత్రకారులు శ్రీ అరసవిల్లి గిరిధర్ (విజయవాడ) గారికి, పుస్తకం ముఖ చిత్రం రూపకల్పనకు చక్కని సలహాలు అందించిన మిత్రులు, ప్రముఖ చిత్రకారులు శ్రీ షేక్ అబ్దుల్లా (విజయవాడ) గారికి, ఎప్పటి లాగే నా పుస్తకాల రూపకల్పన ప్రారంభం నుండి చివరి వరకు అన్ని విధాల సహాయసహకారాలు అందిస్తున్న మిత్రులు శ్రీ నలబోతుల జయరాజు (జయదీప్తి గ్రాఫిక్స్, వినుకొండ) గారికి. నా పుస్తకాల ముసాయిదాను చదివి తగిన సలహాలు–సూచనలు అందించడం ద్వారా సహకరిస్తున్న సద్విమర్శకులు, ఆంగ్లోపన్యాసకులు కొత్తపల్లి రవిబాబు (తెనాలి), ప్రముఖ రచయిత యస్.యం బాషా (అనంతపురం), నా ప్రియమిత్రులు భువనగిరి వెంకట కృష్ణ పూర్ణానందం (ఆంగ్లోపన్యాసకులు, గుంటూరు) గార్లకు నా కృతజ్ఞతలు.

నా రచనా వ్యాసంగానికి సంబంధించిన నా ప్రయత్నాలన్నిటికి తొలినుండి చేయూత అందించిన, నన్ను ప్రోత్సహించిన 'ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్' ఛైర్మన్, నా మేనమామ షేక్ పీర్ అహమ్మద్ (1939–2017), ఉపయుక్తమగు పలు ఉర్దూ గ్రంథాలను నా కోసం చదివి ఆ గ్రంథాలలోని అవసరమైన సమాచారాన్ని నాకు విడమర్చి చెబుతూ, అనుక్షణం నన్ను ఆశీర్వదిస్తూ, ప్రతిక్షణం నా వెంట నిలచి నన్ను ప్రోత్సహించిన మా అమ్మ సయ్యద్ బీబిజాన్ (1936–2008) లకు ఈ సందర్భంగా స్మృత్యంజలి ఘటిస్తున్నాను.

నా ప్రతి ప్రయత్నం వెనుక తానుండి సతతం నాకు చేదోడుగా నిలుస్తూ, అన్నివిధాల ప్రోత్సహిస్తూ, క్రియాశీలక చోదకశక్తిగా సహకరిస్తున్న నా జీవిత భాగస్వామి షేక్ రమిజా భాను, నా గ్రంథరచనా ప్రక్రియ విధానాన్ని, వేగాన్ని నిరంతరం పర్యవేక్షిస్తూ, రచనా వ్యాసంగం మందగించినప్పుడల్లా ప్రశ్నిస్తూ, నన్ను ప్రోత్సహిస్తున్న నా కుమార్తె సయ్యద్ జాస్మిన్ అహమ్మద్‌ల సహకారం లేనట్లయితే ఈ రచనను సజావుగా పూర్తిచేయడం నాకు సాధ్యమయ్యేది కాదు.

ఈ పుస్తక రచనకు పలు గ్రంథాలు, పత్రికలు, వ్యక్తుల, సంస్థల నుండి ప్రత్యక్షంగా / పరోక్షంగా సమాచార సహకారం–సహాయం స్వీకరించాను. ఆ కారణంగా ఈ పుస్తకం సృష్టి 'వ్యష్టి' కృషి అనే కంటే 'సమష్టి' ప్రయత్నంగా భావిస్తూ, ఆయా వ్యక్తులు, గ్రంథాల రచయితలు, ప్రచురణకర్తలకు నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఈ గ్రంథాన్ని చదివిన పాఠక మిత్రులు మార్పులు–చేర్పులు, సూచనలు–సలహా తెలపాల్సిందిగా, తప్పొప్పులను నా దృష్టికి తీసుకరావాల్సిందిగా వినమ్రంగా కోరుతున్నాను. ◆



**డాక్టర్ వినోదిని మాదాసు**
అసోసియేట్ ప్రొఫెసర్,
తెలుగు శాఖ
యోగి వేమన విశ్వవిద్యాలయం
కడప, ఆంధ్రప్రదేశ్.

## పరిచయ వాక్యం

# మరుగునపడిన చరిత్ర శకలం మరో చదువుల తల్లి ఫాతిమా షేక్

మన చరిత్రంతా కొందరి ఘనతను కీర్తిని ప్రశంసించడంలో మునిగిపోయిన కారణంగా ఎందరో మహనీయులు చేసిన మంచి పనులు చరిత్ర కెక్కకుండా పోయాయి. పూజారి వర్గం, పాలక వర్గం, కులీన వర్గం కనుసన్నల్లో నిర్మాణమైన చరిత్ర ప్రజల చరిత్రను నమోదు చేయకుండా విస్మరించింది. అందుకే నవతరం చరిత్రకారులు మనం చదువుకున్న చరిత్ర అసంపూర్ణమైనదని, అసమగ్రమైనదని అభిప్రాయ పడుతున్నారు.

ఈ సమాజం కోసం, ప్రజల కోసం పాటుపడిన ఎందరో మహనీయుల చరిత్ర వెలుగులోకి రాకుండా ముక్కలు ముక్కలుగా విరిగిపోయి చీకటి అడుగున శిధిలమై పోయింది. విస్మరణకు గురయిన అటువంటి చరిత్రను ఇప్పుడు కొందరు చరిత్రకారులు చేతిలో దివిటీ పట్టుకొని చీకటి శిధిలాల కింద నుంచి తవ్వితీస్తున్నారు. విరిగిన ముక్కలన్నిటినీ ఒకచోట చేర్చి కొత్త చరిత్రను నిర్మిస్తున్నారు. ఎందరో త్యాగధనుల జీవితాలను సమాజానికి కొత్తగా పరిచయం చేస్తున్నారు.

గత రెండు దశాబ్దాల కాలంగా తెలుగు సమాజంలో మహాత్మా జోతిరావు పూలే పేరు బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. ఆ వెనుకనే సావిత్రీబాయి పూలే ఘనత తెలుగు ప్రజలకి చేరువయ్యింది. అతిశూద్ర, శూద్ర బాలికల కోసం నూటాడెబ్భయి సంవత్సరాల

ముందే మొదటి పాఠశాలను నడిపిన మహోన్నత స్త్రీల చరిత్ర ఇప్పటి వరకూ పాఠ్య పుస్తకాల కెక్కకపోవడం, ప్రజలకు అందుబాటులోకి రాకపోవడం వెనుక ఆధిపత్య వర్ణాల ప్రభావం ఎంతవుందో మనం అర్ధం చేసుకోవచ్చు.

ఇటీవల కాలం వరకు తెలుగు పాఠకలోకానికి ఫాతిమా షేక్ పేరు కూడా తెలియదు. అక్కడక్కడా అడపాదడపా ఒకరిద్దరు ప్రస్తావించిన తర్వాతే ఆమె పేరు వెలుగు లోకి వచ్చింది. భారతదేశంలో 'ఆడపిల్ల' చదువు కోసం పోరాడిన ఇద్దరు తొలితరం మహిళల్లో మొదటి వ్యక్తి సావిత్రీబాయి పూలేకాగా, రెండవ వ్యక్తి ఫాతిమా షేక్ అని తెలియడానికి ఇంత కాలం పట్టింది. అటువంటి ఫాతిమా షేక్ గురించి సయ్యద్ నశీర్ అహమ్మద్ గారు ఎంతో శ్రమకోర్చి ఎక్కడెక్కడో వున్న పుస్తకాల, చారిత్రక డాక్యుమెంట్ల నుండి సమాచారం సేకరించి ఫాతిమా షేక్ చరిత్రకు ఒక రూపాన్నిచ్చి పాఠకులకు అందించే ప్రయత్నం చేస్తున్నారు. ఈ పుస్తకాన్ని రూపొందించడంలో నశీర్ అహమ్మద్ గారు మహారాష్ట్రకు చెందిన ఎన్నో పుస్తకాలను పరిశీలించినట్టు, పలువురు చరిత్రకారులను, ప్రముఖ రచయితలను సంప్రదించి సమాచారం సేకరించినట్లు వీరు ఆయా సందర్భాలలో ఇచ్చిన ఆధారాలను బట్టి తెలుస్తుంది.

భారత తొలి ఆధునిక ముస్లిం ఉపాధ్యాయురాలు ఫాతిమా షేక్ జీవితానికి సంబంధించిన ఎన్నో విషయాలను ఈ పుస్తకంలో పొందుపర్చారు. ఆమె వ్యక్తిగత జీవితం తో పాటు ఆమె చేసిన సామాజిక సేవను, ఆ సేవ వెనుకనున్న ధైర్యాన్ని, ఔదార్యాన్ని మనమీ పుస్తకంలో చూడవచ్చు. ఆనాటికి స్త్రీలు చదువుకోవడం అనేది సమాజానికి కొరుకుడు పడని విషయం. అటువంటి స్థితిలో ఫాతిమా షేక్, సావిత్రీబాయి పూలేతో కల్సి చదువుకోవడం, ఉపాధ్యాయ శిక్షణ పొందడం వాళ్ల పట్టుదలకు వారి సామాజిక సేవా నిబద్ధతకు నిదర్శనం.

శూద్రులు చదువుకోవడం పట్ల ఆరోజుల్లో బ్రాహ్మణ వర్గాలకు ఎంత వ్యతిరేకత ఉందో, శూద్ర స్త్రీలు చదువుకోవడం పట్ల అంతకు మించి వ్యతిరేకత ఉంది. ముస్లిం స్త్రీల పరిస్థితిలో కూడా పెద్ద తేడా లేదు. ముస్లిం స్త్రీలకు ధార్మిక చదువుల వరకు మాత్రం అనుమతి ఉంది. ముస్లిం స్త్రీలు ఆధునిక విద్య నేర్చుకోవడం పట్ల ఆనాటి

కొందరు ఛాందస ముస్లిం పెద్దలు వ్యతిరేకించడాన్ని గురించి సయ్యద్ నశీర్ అహమ్మద్ గారు ఈ పుస్తకంలో రికార్డు చేశారు. ఫాతిమా షేక్ అన్ని అడ్డంకులను అధిగమించి ఉర్దూ, అరబిక్, భాషల తోపాటు మరాఠీ, ఇంగ్లీషు భాషలను నేర్చుకోవడం గొప్ప విషయం.

' ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్' అనే ఈ పుస్తకంలో ఫాతిమా షేక్‌తో పాటు ఫాతిమా షేక్ అన్నయ్య ఉస్మాన్ షేక్ గురించి, మహాత్మా జోతిరావు పూలే చదువుకు, ఉద్యమానికి తోడ్పాటు నందించిన మున్షీ గఫ్ఫార్ బేగ్ గురించి సమాచారం కూడా అందించారు. మహాత్మా జోతిరావు పూలే స్నేహితుడైన ఉస్మాన్ షేక్, ఆయన చెల్లెలు ఫాతిమా షేక్‌లు మహాత్మా జోతిరావు పూలే తలపెట్టిన కార్యక్రమాల్లో తోడు నిలవడమే కాకుండా వాళ్ల ఇంటిలోని కొంత భాగాన్ని, పాఠశాలగా మార్చి బాలికల విద్యాబోధనకు తోడ్పాటు నందించారు. భారతదేశంలో బాలికల విద్య కోసం ఇంటింటికి తిరిగి ప్రచారం చేసిన ధీరవనితలు సావిత్రీబాయి పూలే – ఫాతిమా షేక్‌లు. వీరిరువురు సమాజం నుంచి దారుణమైన రీతిలో ఎదురైన అసమ్మతిని, అవమానాన్ని, తిరుగుబాటును ఎదుర్కొని ఆడపిల్లల చదువు కోసం బలంగా, స్థిరంగా నిలబడిన తొలి ఉపాధ్యాయ ఉద్యమకారిణులు.

సయ్యద్ నశీర్ అహమ్మద్ గారు ఈ పుస్తకంలో అవసరమైన ప్రతిచోటా తగిన చారిత్రక ఆధారాలతో సహా ఎన్నో కొత్త విషయాలను మన ముందుంచారు. ఇటువంటి పుస్తకాలు చదివినప్పుడు ఎందరో మహనీయుల సేవలను సమాజానికి తెలియకుండా కొందరు వ్యక్తులు, శక్తులు తొక్కిపెట్టారని మనకు అర్థమవుతుంది. అటువంటి చరిత్రను, ప్రత్యామ్నాయ భావజాలం ఉన్న నిజమైన చరిత్రను ప్రజలకు అందించాలన్న తపన ఉన్న చరిత్రకారులు మాత్రమే వెలికి తీయగలుగుతారు. మహారాష్ట్రలో కొందరు చరిత్రకారులు అటువంటి ప్రయత్నం చేయడం అభినందించదగిన విషయం. బహుజన చరిత్రను పునర్లిఖించడానికి తెలుగులో కూడా కొందరు చరిత్రకారులు, రచయితలు, ఉద్యమకారులు పరిశోధకులు ప్రయత్నం చేస్తున్నారు.

ఈ క్రమంలోనే సయ్యద్ నశీర్ అహమ్మద్ గారు అందిస్తున్న ఈ పుస్తకం గుర్తించదగింది. శకలాలుగా ఉన్న ఫాతిమా షేక్ చరిత్రను వెతికి తెచ్చి ఒక వరుస

క్రమంలో పెట్టి పాఠకులకు అందిచండానికి నశీర్ అహమ్మద్ గారు చేస్తున్న ఈ ప్రయత్నం ఎంతో విలువైనది. ఈ సమాచారం భవిష్యత్తు చరిత్ర పరిశోధకులకు మార్గదర్శకంగా ఉంటుందని మనం ఆశించవచ్చు !

సయ్యద్ నశీర్ అహమ్మద్ గారు తెలుగు పాఠకులకు సుపరిచితులైన చరిత్రకారులు. భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను వివరిస్తూ వీరు అనేక పుస్తకాలు వెలువరించడం మనకు తెల్సు. చరిత్ర మరుగున పడిపోయిన ఎంతో మంది పోరాట యోధుల చరిత్రను, త్యాగాన్ని పరిశోధించి పుస్తకాల కెక్కించి పాఠకులకు అందించారు. ఈ క్రమంలో ఇది ఇరవయ్యవ పుస్తకం. ఈ పుస్తకంలో ఫాతిమా షేక్, ఉస్మాన్ షేక్, మున్షీ గఫ్ఫార్ బేగ్‌ల విషయాలను మనకు అందిస్తున్న నశీర్ గారు అభినందనీయులు. వారే చెప్పినట్టు ఈ పుస్తకం సంపూర్ణం, సమగ్రం కానప్పటికి ఆయన అందించిన విలువైన సమాచారం ముందు ముందు మరింత పరిశోధనకు ఉపకరించ గలదన్నది వాస్తవం.

ఈ పుస్తకం అనుబంధంలో మహాత్మా జోతిరావు ఫూలే ఇస్లాం గురించి, ప్రవక్త ముహమ్మద్ (స) గురించి, ముస్లిం సమాజాన్ని గురించి 'మానవ్ ముహమ్మద్' పేరుతో రచించిన ఒక స్తుతి గీతాన్ని తెలుగులో అనువదించి జోడించారు. మహాత్మా జోతిరావు ఫూలే ముస్లిం సమాజంతో కల్సి జీవించడం, ముస్లిం సమాజంతో కల్సి పని చేయడం, ముస్లిం జీవితాలను దగ్గరగా చూడటం లాంటి విషయాలు మహాత్మా ఫూలే ఈ గీతం రాయడానికి ప్రేరేపించి ఉండవచ్చని ఈ పుస్తకం అనుబంధంలో వీరు ప్రస్తావించారు. ఆనాటికి ముస్లిం సమాజానికి బహుజనులతో ఉన్న సంబంధాలను మహాత్మా ఫూలే జీవితం, మహాత్మా జోతిరావు ఫూలే రచనలు తెలియ చెప్తాయి.

ఫాతిమా షేక్ జీవితంలోని ముఖ్యాంశాలను ఏర్చికూర్చి ఒక పుస్తకంగా పాఠకులకు అందిస్తున్నారు. సయ్యద్ నశీర్ అహమ్మద్ గారు చేస్తున్న ఈ ప్రయత్నానికి హృదయపూర్వక అభినందనలు. ఇకనించి సావిత్రీబాయి ఫూలే పేరు పక్కన ఫాతిమా షేక్ పేరు కూడా సగౌరవంగా చేర్చి, ఈ ఇద్దర్ని చదువుల తల్లులుగా ప్రజానీకం హృదయాలకు హత్తుకుంటారని ఆకాంక్షిస్తున్నాను. ◆

# ఇందులో...

మన దేశంలో అతి శూద్రులు, శూద్రులుగా విభజించబడి విద్యకు దూరం చేయబడిన సామాజిక వర్గాలను, ప్రధానంగా బాలికలను విద్యావంతుల్ని చేయడానికి ఉద్యమించిన మహాత్మా జోతిరావు ఫూలే (1827–1890), సావిత్రీబాయి ఫూలే (1831–1897) దంపతుల ఉద్యమం ప్రారంభ దశలో పూర్తి స్థాయిలో తమ అండదండలు అందించిన కుటుంబ సభ్యురాలు ఫాతిమా షేక్. జోతిరావు ఫూలే ఆరంభించిన సామాజిక ఉద్యమంలో భాగస్వామ్యం వహించిన గొప్ప సామాజిక ఉద్యమకారిణి ఫాతిమా షేక్. మహిళలను విద్యావంతుల్ని చేయడానికి కంకణం కట్టుకున్న సావిత్రిబాయి ఫూలే సహచరిణి. విద్యార్జన వలన కలుగు ఉపయోగాలను ఇంటింటా ప్రచారం చేసిన అవిశ్రాంత సంస్కరణాభిలాషి ఫాతిమా షేక్. భవ్య భారత సమాజం నిర్మాణానికి, విద్య కొందరికి మాత్రమేనన్న భావన నుండి దూరంగా విద్య సర్వజనులకు అను దార్శనిక ఆలోచనలతో ముందడుగు వేసిన విద్యావేత్త ఫాతిమా షేక్. భారత ఆధునిక విద్యారంగాన అధికారిక ఉపాధ్యాయ శిక్షణాలయంలో విద్యాభ్యాసన చేసి, విద్యాబోధనకు అర్హత పొందిన తొట్టితొలి ముస్లిం మహిళ ఫాతిమా షేక్. ఆధునిక భారత విద్యారంగాన ఉపాధ్యాయ శిక్షణాలయంలో విద్యాభ్యాసం చేసి విద్యాబోధన కూడా చేసిన తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు ఫాతిమా షేక్. ఆధునిక భారత విద్యారంగాన ఉపాధ్యాయ శిక్షణాలయంలో శిక్షణపొంది మహాత్మా జోతిబాపూలే స్థాపించిన పాఠశాలల నిర్వహణ బాధ్యతలను చేపట్టి నిర్వహించిన ముస్లిం ప్రధానోపాధ్యాయురాలు ఫాతిమా షేక్.

ఆధునిక భారత విద్యారంగం తొలి రోజులలో విద్యాబోధనారంగాన దళిత-బహుజన-మహిళా సమూహాలకు స్వచ్ఛందంగా విద్యాబోధన గావించటంలో మహాత్మా జోతిబా పూలే, సావిత్రీబాయి పూలేలతో కలసి 170 ఏండ్ల క్రితం కృషిచేసి చిరస్మరణీయ ఖ్యాతిని సొంతం చేసుకున్న ఫాతిమా షేక్ మహారాష్ట్ర రాష్ట్రంలోని పూనా నగరం నివాసి. ఆమె కుటుంబం ఉత్తరప్రదేశ్ రాష్ట్రం నుండి మహారాష్ట్రలోని ప్రస్తుత నాసిక్ జిల్లా మాలెగావ్ (Malegaon) వచ్చి స్థిరపడింది. ఆ కుటుంబ సభ్యులు వృత్తిరీత్యా చేనేత-వస్త్ర వ్యాపారులు. ఆ తరువాతి కాలంలో చేనేత వృత్తిదారుల వ్యాపారంలో ఏర్పడిన సంక్షోభం, ఎదురైన కరువు పరిస్థితుల వలన ఆ కుటుంబం మాలెగావ్ నుండి అలనాడు పుణే (Pune) గా పిలువబడిన ప్రస్తుత పూనా (Poona) చేరుకుంది.

చిన్నతనంలో ఫాతిమా షేక్ తల్లితండ్రులను పోగొట్టుకున్నారు. ఆమె సోదరుడు ఉస్మాన్ షేక్ పర్యవేక్షణలో ఆమె పెరిగి పెద్దదయ్యారు. ఆ అన్నా-చెల్లెల్లకు పూనాలోని గంజ్‌పేట్ నివాసి మున్షీ గఫ్ఫార్ బేగ్ పెద్ద దిక్కుగా నిలిచారు. ఆ విధంగా పూనా చేరుకున్న ఉస్మాన్ షేక్, ఫాతిమా షేక్ కుటుంబం పూనా పట్టణంలోని గంజ్‌పేట్ ప్రాంతంలో ఆవాసం ఏర్పర్చుకుని స్థిరపడింది. **(సత్యశోధక్ ఫాతిమా షేక్ (మరాఠి వ్యాసం), డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, 'ముస్లిం సత్యశోధక్ పత్రిక', మరాఠి త్రైమాస పత్రిక, సంపాదకులుః డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, జూలై-ఆగస్టు 2020, పూనా, పుట.43).**

ఆనాడు మహారాష్ట్ర లోని పూనా కేంద్రంగా మహాత్మా జోతిరావు పూలే ఆయన భార్య సావిత్రీబాయి అతిశూద్ర, శూద్ర సామాజిక వర్గాలకు ప్రధానంగా బాలికలకు విద్యగరపాలన్న మహత్తర లక్ష్యంతో ఆరంభించిన సామాజికోద్యమానికి ఫాతిమా షేక్, ఆమె సోదరులు ఉస్మాన్ షేక్, బహుభాష పండితులు మున్షీ గఫ్ఫార్ బేగ్‌లు ఎంతగానో సహాయపడ్డారు, సహకరించారు, ఆ సహకారం-సహాయం ప్రాధాన్యత-ప్రాముఖ్యత ఏపాటిదన్న విషయం మనకు అవగతం కావాలంటే ఆనాడు మహారాష్ట్ర రాష్ట్రంలోని పూనా ప్రాంతంలో నెలకొన్న సామాజిక పరిస్థితులను తెలుసుకోవడం అత్యవసరం.

## ఆనాటి సామాజిక స్థితిగతులు

'మహారాష్ట్రలో పూలే దంపతులు నివసించిన కాలం నాటికి మత, రాజకీయ, సామాజిక వ్యవస్థలన్నీ బ్రహ్మణీయ, సవర్ణ-భూస్వామ్య శక్తుల ఆధీనంలో ఉన్నాయి.

ఫూలే తన రచనల్లో చాలా చోట్ల పేర్కొన్నట్టుగా శక్తిమంతంగా నిర్మితమైన కుల వ్యవస్థ పీడిత కులాల మీద పెత్తనం చేస్తూ వాళ్ళ శ్రమనూ, అజ్ఞానాన్ని మత విశ్వాసాలనూ ఆధారం చేసుకుని దోపిడికి పాల్పడుతూ ఉంది. అన్ని కులాల, వర్గాల స్త్రీల జీవితాలూ హీనమైన పరిస్థితులలోనే ఉన్నాయి. వాళ్ళను కనీసం వ్యక్తులుగానైనా గుర్తించని సమాజం, స్త్రీలను తమ కుటుంబాలకు చెందిన ఆస్తులుగా, భౌతిక, లైంగిక, ఆర్థిక ప్రయోజనాలను అందించే యంత్రాలుగా పరిగణిస్తోంది. సామాజిక జీవితంలో వాళ్ళకేమాత్రమూ స్థానం లేదు.' **(సామాజిక విప్లవకారులు, వ్యాసంః సింధియా స్టీఫెన్, సామాజిక విప్లవకారిణి సావిత్రీబాయి, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్ 2010. వ్యాస సంకలనం. అనువాదంః కాత్యాయిని, పుట.16).**

ఆనాడు ఆడపిల్లలను మాత్రమే కాదు అతిశూద్ర, శ్రూద కులాలను కూడా విద్యకు కడు దూరంగా నెట్టబడ్డాయి. 'మగపిల్లలు కాని ఆడపిల్లలు కానీ, చదువు నేర్చుకోడానికి ఆనాడు సమాజంలో ప్రబలి ఉన్న మూఢనమ్మకాలు, ఆవరోధంగా నిలిచాయి. శూద్రులకు అతి శూద్రులకు చదువుకునే హక్కులేదని ఒక్క బ్రాహ్మణులకు మాత్రమే ఆ హక్కు ఉన్నదనీ ప్రజలు నమ్మడం ముఖ్యమైన అవరోధం. అప్పటి సాధారణ శాస్త్ర విజ్ఞానమంతా సంస్కృత భాషలో ఉండేది. సంస్కృతం దేవభాష. బ్రాహ్మణులు తప్ప మరెవ్వరూ ఆ భాష నేర్చుకోకూడదు. ఇదీ సమస్య. సంపన్న వర్గాలు వారికి ఇంటి దగ్గర కులాసాగా కాలం గడపటం తప్ప చదువు అవసరం కనిపించటం లేదు. మూఢాచారాలు, సంప్రదాయబద్ధమైన అలవాట్లు వారికి ఆ ఆలోచనే రాకుండా చేసాయి. మత సంప్రదాయాలకు అంకితమైపోయిన కొందరైతే చదువుకోవడం న్యూనతగా భావించేవారు. మిషనరీల పాఠశాలలో చదువుకోవడం అంటే మరింత సిగ్గుచేటుగా భావించేవారు' **(మహాత్మా జోతిరావ్ ఫూలే, మూలం : ధనుంజయ్ కీర్, అనువాదంః డాక్టర్ బి. విజయభారతి, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్, 2018, పుట.10)**.

## మహాత్మా జోతిరావు ఫూలే

అలాంటి విపత్కర వాతావరణం సాంఘిక వ్యవస్థను నియంత్రిస్తున్న సమయంలో మహాత్మా జోతిరావు పూలే 1827 ఏప్రిల్ 11న గోవిందరావు పూలే, చిన్మనాబాయి లకు పూనాలో జన్మించారు. చదువు పట్ల ఆసక్తి గల గోవిండరావు తన బిడ్డను ఏడవ ఏట

ఒక మరాఠి పాఠశాలలో చేర్పించారు. 'ఆ పసివాడు కూడా బుద్ధిగా బడికి వెళ్ళి శ్రద్ధాసక్తులతో చదువుకోవడం మొదలు పెట్టాడు. అంతా సజావుగా జరిగిపోతున్న సమయంలో ఎవరో గోవిందరావు మనసు పాడుచేసారు. పర్యవసానంగా అసలు ఆ చదువుల ప్రయోజనం ఏమిటి? కుర్రవాడికి ఈ చదువు ఎంతవరకు ఉపయోగ పడుతుంది?' అని గోవిందరావు ఆలోచనలో పడ్డాడు. **(మహాత్మా జోతిరావ్ ఫూలే, మూలం : ధనుజంయ్ కీర్, అనువాదంః డాక్టర్ బి. విజయభారతి, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్, 2018, పుట.10)**

జోతిరావు ఫూలే తండ్రి 'గోవిందరావు దుకాణంలో గుమాస్తాగా ఉన్న బ్రాహ్మణుడొకడు ఈ ఆలోచనను ప్రేరేపించి, అయనను తప్పుదోవ పట్టించి జోతిరావు చదువు ఆగిపోడానికి కారణమయ్యాడు అంటే క్రిందివర్గాల వారి చదువు ఆనాటి బ్రాహ్మణులకు ఎంత బాధాకరంగా పరిణమించిందో అర్థమవుతుంది. అప్పటికి జోతిబా ఇంచు మించుగా తన మరాఠి కోర్సు పూర్తిచేశాడు, వ్రాయడం చదవడం నోటి లెక్కలూ నేర్చుకున్నాడు. ఈ పరిస్థితులలో ఓర్వలేని ఇతరుల మాటలు విని గోవిందరావు జోతి చదువు మానిపించాడు' **(మహాత్మా జోతిరావ్ ఫూలే, మూలంఃధనుంజయ్ కీర్, పుట.10).**

## జోతిరావుకు మున్షీ గఫ్ఫార్ బేగ్ తోడ్పాటు

ఆ విధంగా జోతిరావు ఫూలే చదువు మధ్యలోనే ఆగిపోయింది. ఆ తరువాత 1840లో జోతిరావుకు 9 ఏండ్ల సావిత్రీబాయితో ఆయన తండ్రి గోవిందరావు ఫూలే వివాహం జరిపించారు. మంచిగా చదువుకుంటున్న చురుకైన విద్యార్థి జోతిరావు బడి మానేసి పలుగు, పార పట్టి పూలతోట పనులలో నిమగ్నం కావడం గమనించి ఫూలే ఇంటి పొరుగున ఉంటున్న మున్షీ గఫ్ఫార్ బేగ్ బాధపడ్డారు. చిన్ననాటనే తల్లిని కోల్పోయిన జోతిరావు ఫూలే మేనత్త సుగుణాబాయికి తన సోదరుడు గోవిందరావు ఫూలే చర్యలు తెలిసాయి. ఆమె ఆఘమేఘాల మీద మున్షీ గఫ్ఫార్ బేగ్‌ను కలిసారు. ఆయన ఉర్దూ, పర్షియన్ భాషలను బోధించే ఉపాధ్యాయులు. గోవిందరావుకు మంచి మిత్రులు. ఆ కారణంగా ఎలాగైనా తన సోదరుడు గోవిందరావుకు నచ్చజెప్పి తనకు కుమారుడితో సమానుడైన జోతిరావు ఫూలే తిరిగి పాఠశాలకు వెళ్ళేట్టుగా చూడమని కోరారు. **(సామాజిక విప్లవకారిణి సావిత్రీబాయి (తెలుగు), వ్యాససంపుటి, వ్యాసంః పూలే దంపతులకు స్ఫూర్తి**

**ప్రదాత– సుగుణాబాయి, వ్యాసకర్త: ప్యామోలా సర్దార్, తెలుగు అనువాదం: కాత్యాయని, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 2017, పుట. 46).**

ఒక చురుకైన విద్యార్థి జోతిరావు పూలే చదువు అర్ధాంతరంగా ఆగిపోవడం వీలులేదని భావించిన మున్షీ గఫ్ఫార్ బేగ్ మరొక క్రైస్తవ మతాధికారి లెజిత్ (Lizit) కలసి జోతిరావును తిరిగి బడికి పంపమని పలు విధాలుగా గోవిందరావుకు నచ్చజెప్పారు. ఆ ప్రయత్నాల కారణంగా జోతిరావును 1841లో స్కాటిష్ మిషనరీ స్కూల్‌లో చేర్చారు. అప్పటికి మూడు సంవత్సరాల విద్యను కోల్పోయిన జోతిరావు చదువు మున్షీ గఫ్ఫార్ బేగ్ చొరవ వలన పునఃప్రారంభమయ్యింది **(Jotirao Phule, Tareekhateertha Lakxmanshastri Joshi, National Book Trust , India, New Delhi, 1992, Page No. 7).** ఆనాడు కనుక జోతిరావు పూలే విద్యార్థి జీవితంలో మున్షీ గఫ్ఫార్ బేగ్ నిర్వహించిన క్రియాశీలక పాత్ర లేకున్నట్టయితే భారత దేశంలో మహత్తర సామాజికోద్యమాన్ని ఉన్నత దిశగా నడిపిన పలు మార్పులకు, సంస్కరణలకు మూలకారకుడయిన మహాత్మా జోతిరావు పూలే ఉద్యమ చరిత్రకు ఆరంభమూ అంతమూ ఉండేది కాదు.

మహారాష్ట్ర, షోలాపూర్‌కు చెందిన ప్రముఖ చరిత్రకారులు సయ్యద్ షాహ్ గాజియుద్దీన్ ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ 'జ్యోతిబా పూలే విద్యాభ్యాస సమయంలో ఒక ముస్లిం ఉపాధ్యాయుని కృషి ప్రధాన మైలు రాయిగా నిలిచింది. విద్యాభ్యాస సమయంలో జ్యోతిబా సంపాదించుకున్న ఆంగ్ల భాష ప్రావీణ్యత ఆయనకు పశ్చిమ దేశాల ఉద్యమకారుల గ్రంథాలను అధ్యయనం చేయడానికి తోడ్పడింది. ఆయనలో సామాజిక స్పృహను నింపడంలో ప్రధాన భూమిక పోషించింది. జ్యోతిబా పూలేను మహాత్మా జ్యోతిబా పూలేగా మార్చడంలో మున్షీ గఫ్ఫార్ బేగ్ పాత్రను కొనియాడిన రచయితలు, జ్యోతిబా జీవితంలో ఒక కపట బ్రాహ్మణుడి ద్వారా నష్టపోయిన జ్యోతిబా విలువైన సమయం గురించి కూడా చర్చించారు' **(Mahatma Jyothiba Phule (Hayat Aur Karname), Syed Shah Ghaziuddin, Idara Barae Mutalea Wa Tahqiq Tarkhe Deccan, Solapur, 2010, Page No. 34),** అని పేర్కొన్నారు.

ఆ తరువాత స్కాటిష్ మిషనరీ స్కూల్‌లో చేరిన జోతిరావు పూలే అక్కడ మాత్రమే కాకుండా పూనాలోని బుధవార్ పేట్ ప్రాంతంలో గల ప్రభుత్వ పాఠశాలలో కూడా విద్యాభ్యాసం చేసారు. ఆ సందర్భంగా ఆయనకు పలువురు ఇతర కులాల, మతాల

విద్యార్థులతో పాటుగా ముస్లిం విద్యార్థులతో సన్నిహిత సబంధాలు ఏర్పడ్డాయి. ఆ మిత్రులతో ఇస్లాం–హిందూ మతం మంచి చెడుల తులనాత్మక చర్చలు సాగించారు. **(Jotirao Phule, Tarkateertha Lakxmanshastri Joshi, National Book Trust , India, New Delhi, 1992, Page No. 7)**

ఆ క్రమంలో 1847లో ఆంగ్ల విద్య పూర్తి చేసుకున్న జోతిరావు ఫూలే తండ్రి గోవిందరావు చేస్తున్న వ్యాపారంలో పాల్గొనటం ఆరంభించారు. ఆయన చదివిన గ్రంథాలలో పాశ్చాత్య రచయితలు, స్వదేశీ ప్రముఖులు వెలుబుచ్చిన మానవత్వం, స్వేచ్ఛ–సమానత్వ భావనలు, ఆలోచనలు ఆయనను పూల వ్యాపారంలో నిలువనియ్యకుండా చేయసాగాయి. ప్రపంచ దేశాలలో వస్తున్న మార్పులు, అక్కడి స్వేచ్ఛాయుత సామాజిక వాతావరణం తదితర విషయాలను అధ్యయనం చేసేకొద్ది జోతిరావు ఫూలే మనస్సు పరిపరి విధాల ఆలోచించసాగింది.

ఆ సమయంలో ఆయన సామాజికోద్యమం దిశగా సాగటానికి పురికొల్పిన ఒక దుస్సంఘటన కారణంగా ఆయన మస్తిష్కంలో రేకెత్తిన భావ సంచయం జోతిరావు ఫూలే భవిష్యత్తును నిర్దేశించి భారతావనికి మహాత్మా జోతిరావు ఫూలేని అందజేసింది. ఆ సంఘటన నేపథ్యంలో సాగిన అంతర్మథనం తరువాత అలనాటి బ్రాహ్మణీయ సామాజిక వ్యవస్థ ఆధిపత్యం, బానిసత్వం నుండి అతి శూద్ర, శూద్ర సామాజిక వర్గాలతోపాటుగా మహిళలకు విముక్తి కలగజేయాలంటే సర్వులకు విద్యను అందజేయడం ద్వారా మాత్రమే అది సాధ్యమన్న నిర్ణయానికి జోతిరావు ఫూలే వచ్చారు. ఆ నిర్ణయం మేరకు విద్యను అతిశూద్ర, శూద్ర సామాజిక జనసమూహాల తోపాటుగా ప్రధానంగా మహిళలకు విద్యగరపడానికి భవిష్యత్తు కార్యాచరణను నిర్దేశించుకుని కార్యనిర్వహణకు పూనుకున్నారు.

## బాలికలకు పాఠశాల ప్రారంభం

భవిష్యత్తు కార్యాచరణను పక్కాగా నిర్దేశించుకున్న జోతిరావు ఫూలే అతిశూద్ర, శూద్ర సామాజిక జనసమూహాలతోపాటుగా మహిళలకు విద్యాబోధన చేయడానికి ఉపాధ్యాయుల తయారీకి సిద్ధమయ్యారు. ఆయన ముందుగా తన భార్య సావిత్రీబాయికి విద్యగరిపారు. విద్యను బోధించగల శిక్షణను ఆయన స్వయంగా ఆమెకు కల్పించారు. 1948 ఆరంభంలో అతిశూద్ర, శూద్ర కులాలకు, బాలికలకు విద్య గరిపేందుకు పూనాలోని బుధవార్‌పేట (Budhwar Peth) ప్రాంతానికి చెందిన భిదేవాడ (Bhide Wada) లో ఆయన తొలి పాఠశాలను ప్రారంభించారు.

# ఆగ్రహించిన అగ్రకులాధిపత్యం

జోతిరావు పూలే చర్యతో అగ్రకులాలు ఆగ్రహించాయి. అతిశూద్ర, శూద్ర కులాలకు, బాలికలకు విద్య గరిపేందుకు పాఠశాలను ఆరంభించడాన్ని సహించలేక పోయాయి. 'ఒక శూద్రుడు శూద్రుల కోసము ప్రారంభించిన బడి ఇది. దేశంలో అలాంటి మొదటి పాఠశాల ఇదే. బ్రాహ్మణ వర్గాలలో ఈ సంగతి గొప్ప అలజడి కలిగించింది. ఇదొక తిరుగుబాటుగా, విద్రోహచర్యగా వారు భావించారు. 'విజ్ఞానమూ, వైదుష్యమూ శూద్రులకా? ఎంత అపచారం'. మతాన్ని దైవాన్నీ కాదని ఇలాంటి అప్రాచ్యపు పనులు చేయటానికి వారికి ధైర్యం ఎక్కడ నుండి వచ్చింది? శూద్రులకు అసలు చదువు నేర్చుకునే హక్కే లేనప్పుడు, నేర్పే హక్కు ఎక్కడిది? తగుదునమ్మా అని చదువు చెప్పటానికి తయారయ్యాడా? అందులోనూ ఆడపిల్లలకు...ఆడపిల్ల పరాయి మగవాడి కంట పడటం ఎక్కడైనా ఉందా? ఇదంతా హిందూ మత నాశనానికి వచ్చింది' అని బ్రాహ్మణ పెద్దలు మండి పడ్డారు' **(మహాత్మా జోతిరావ్ ఫులే, మూలంః ధనుంజయ్ కీర్, అనువాదంః డాక్టర్ బి. విజయభారతి, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్, 2018, పుట. 21).**

ఆ విధంగా మండిపడిన ఆ వ్యక్తులు–శక్తులు ఎలాగయినా జోతిరావును తన ప్రయత్నాల నుండి నిలువరించాలని నిశ్చయించుకున్నాయి. ఆయనను అదిరించి బెదిరించి చూసాయి. కుల పెద్దల చేత చెప్పించి చూసాయి. ప్రయోజనం లేకుండా పోయింది. జోతిరావు పాఠశాలను ప్రారంభించటం మాత్రమే కాకుండా విద్యార్థులకు చదువు చెప్పటానికి తన భార్య సావిత్రీబాయిని కూడా ఉపాధ్యాయిరాలిని చేసారు. అగ్రవర్ణ సమాజం నుండి ఎదురవుతున్న అభ్యంతరాలను ఏమాత్రం ఖాతరు చేయకుండా తాము ప్రారంభించిన పాఠశాలను నిర్విఘ్నంగా నడపాలని నిర్ణయించుకున్న జోతిరావు వ్యక్తుల–శక్తుల మండిపాటును లెక్కచేయకుండా తన మార్గాన ముందుకు సాగారు.

మింగుడు పడని ఈ చర్యలను నిరోధించడానికి బ్రాహ్మణీయ సామాజిక వ్యవస్థ సిద్ధమయ్యింది. యువకుడు జోతిరావు పూలే తమ మాట వినకపోవడంతో మరో మార్గాన్ని ఎన్నుకుంది. ఏ విధంగానైన పరిస్థితులను తమకు అనుకూలంగా మార్చుకుని 'సమాజాన్ని అదుపులో పెట్టడంలో కిటుకులు బాగా తెలిసిన బ్రాహ్మణులు జోతిబాను వదలి ఆయన తండ్రిని బాధించటం మొదలు పెట్టారు...'నీ కొడుకు హిందూ సమాజానికి కళంకంగా



మహాత్మా జోతిరావు పూలే - సావిత్రీబాయి పూలే

తయారయ్యాడు. నీ కోడలు కూడా సిగ్గు వదలిపెట్టి కులానికి అప్రతిష్ఠ తెస్తున్నది. వీరిద్దరూ ధర్మ విరుద్ధ పనులు చేస్తున్నారు. ఇది దైవానికి అపచారం చేసినట్లవుతుంది. ఇది మహాపాతకం. మతం తరపునా, దైవం తరపునా మేము ఆజ్ఞాపిస్తున్నాం. ఈ పనులన్నీ ఆపివేయాలని వారితో చెప్పు. వినకపోతే వారిని ఇంటి నుండి వెళ్ళగొట్టు' **(మహాత్మా జోతిరావ్ పులే, మూలంః ధనుంజయ్ కీర్, పుట.21)** అని పూలే తండ్రి గోవింద రావుకు గట్టిగా ఆదేశాలు జారీచేశారు.

మతం పట్ల, కుల వ్యవస్థల పట్ల మూఢ విశ్వాసాలను పెంచుకున్న గోవిందరావు వారికి బదులు చెప్పలేక పోయారు. కుమారుడికి నచ్చజెప్పి దారికి తీసుకురావాలని నిర్ణయించుకున్నారు. ఈ విషయమై తండ్రి కొడుకుల మధ్య తీవ్రస్థాయిలో వాగ్వివాదాలు జరిగాయి. చర్చలు సాగాయి. తండ్రి ఎంత చెప్పినా జోతిరావు పూలే తాను నిర్దేశించుకున్న మార్గం, కార్యాచరణ నుండి వైదొలిగేది లేదని తన అభిప్రాయాలను కుండ బద్దలు కొట్టినట్టు స్పష్టం చేసారు. కుమారుడి చర్యల పట్ల అయిష్టతను వ్యక్తంచేస్తూ, గోవిందరావు తన కొడుకు-కోడల్ని తన ఇల్లు వదలి వెళ్ళిపొమ్మని ఆదేశించారు.

# ఆపత్కాలంలో ఆదుకున్న ఉస్మాన్ షేక్

బ్రాహ్మణీయ సామాజిక వ్యవస్థ ప్రమేయం వలన, విధించిన ఆంక్షలు-నిషేధాల పర్యవసానంగా జోతిరావు పూలే ఆయన భార్య కట్టుబట్టలతో తన ఇంటి నుండి బయటకు రావాల్సి వచ్చింది. ఆనాటి బ్రాహ్మణీయ సామాజిక వ్యవస్థ ఆజ్ఞలను వ్యతిరేకించలేని పూలే కుటుంబం గాని, ఆయన సామాజిక వర్గంగాని సహకరించలేక పోయింది. ఆచ్ఛాదనను కల్పించడానికి ముందుకు రాలేకపోయింది. ఆకస్మికంగా ఇంటి నుండి గెంటి వేయబడిన పూలే దంపతులకు ముందుగా తలదాచుకోవడానికి నీడ అవసరం వచ్చింది. జోతిరావు తండ్రి నివాసం ఉంటున్న ప్రాంతంలోని వారెవ్వరూ కూడా ఆ దంపతులకు ఆశ్రయం కల్పించడానికి సాహసించ లేకపోయారు. ఆ గడ్డు సమయంలో జోతిరావు పూలే, సావిత్రీబాయి పూలేలను ఆదుకునేవారెవ్వరూ లేకుండా పోయారు.

ఆ ఆపత్కాలంలో జోతిరావు చదువు కొనసాగించడానికి తోడ్పాటు అందించిన మున్షీ గఫ్ఫార్ బేగ్ మళ్ళీ ముందుకు వచ్చారు. ఆయన పూలే దంపతులను వెంటబెట్టుకుని పూనాలోని గంజ్‌పేట్‌లో నివాసం ఉంటున్న ఉస్మాన్ షేక్ ఇంటికి తీసుకెళ్ళారు. ఆ ఉస్మాన్ బేగ్ జోతిరావు పూలే ఇరువురు మిత్రులు. మిత్రుడు జోతిరావు ఎదుర్కొంటున్న సమస్యలను తక్షణం అర్థం చేసుకున్న ఉస్మాన్ షేక్, పూలే దంపతులను తన ఇంట ఉండమని ఆహ్వానించారు. ఉదార స్వభావం మాత్రమే కాకుండా విశాల సామాజిక దృష్టి, బాలికల విద్య పట్ల సకారాత్మక దృక్పథం గల ఉస్మాన్ షేక్ తన ఇంటిలో రెండు గదులను మిత్రుడు జోతిరావు పూలే దంపతులకు కేటాయించారు. ఆయన తక్షణమే తన సోదరి ఫాతిమా షేక్‌ను పిలిచి అవసరమగు ఏర్పాట్లు చూడమన్నారు. జోతిరావు పూలేకు అన్ని విధాల ఆదుకునేందుకు ఉస్మాన్ షేక్ అభయం ఇచ్చారు. అందుకు అనుగుణంగా చర్యలు తీసుకున్నారు. **(ఉర్దూ పాఠ్యపుస్తకం, రెండవ తరగతి, బాలభారతి, మహారాష్ట్ర రాష్ట్రప్రభుత్వం ప్రచురణ, పూనా, 2013, పుట. 59).**

ఈ విషయాన్ని డాక్టర్ తాహెరా షేక్ తన 'క్రాంతిజ్యోతి సావిత్రిబాయి పూలే' గ్రంథంలో వివరంగా ప్రస్తావిస్తూ 'షేక్ ఉస్మాన్ జోతిబాకు కేవలం తన ఇంటిని మాత్రమే నివాసం కొరకు ఇవ్వలేదు. అంతకు మించి దుస్తులు, వంట పాత్రలు ఇంకా తదితర అత్యవసర వస్తువులన్నీ ఇచ్చి ఆదుకున్నారు...జోతిబా వయోజన దళితుల కోసం ఒక

పాఠశాల ప్రారంభిస్తున్నారని, కాని ఎవ్వరూ ఇల్లు ఇవ్వడానికి సంసిద్ధంగా లేరని తెలిసినప్పుడు ఉస్మాన్ షేక్ సంతోషంగా తన ఇంటిని తన లక్ష్యసాధన కోసం వాడుకొమ్మని అనుమతి ఇచ్చారు. ఈ విధంగా దళిత వయోజనుల విద్య కోసం ఉస్మాన్ షేక్ ఇల్లు మొదటి పాఠశాలగా మారింది...ఉస్మాన్ షేక్ చెల్లెలు ఫాతిమా షేక్ జోతిబా పూలేను రకరకాలుగా ఆదుకుంది' **(క్రాంతిజ్యోతి సావిత్రిబాయి పూలే, డాక్టర్ తాహెరా షేక్, అదిల్ పబ్లికేషన్స్, పూనా, 2000. పుట. 55)** అని పేర్కొన్నారు. ఈ విషయాన్ని 'కష్టకాలంలో ఉపయోగ పడ్డారు' (బురే వక్త్ మే కామ్ ఆయేం) అను శీర్షికతో ప్రముఖ రచయిత సోమనాధ్ దేశ్‌కర్ మరిన్ని వివరాలతో జోతిరావు పూలే కష్టకాలంలో ఉన్నప్పుడు ఉస్మాన్ షేక్, ఫాతిమా షేక్ ఏ విధంగా ఆయనను ఆదుకున్నది మరిన్ని వివరాలతో ధృవపర్చారు. **(సంత్, మహాత్మా, విచారక్ ఔర్ ఇస్లాం (హిందీ), సంకలనంః సోమనాధ్ దేశ్‌కర్, సందేశ్ ప్రకాషన్, పూనా, 2014. పుట. 43).**

ఈ క్రమంలో ప్రఖ్యాత రచయిత, చరిత్రకారుడు ధనుంజయ్ కీర్ తన **'మహాత్మా జోతిరావు పులే' గ్రంథంలో (పుట.25)**, ప్రముఖ రచయిత తారకతీర్ధ లక్ష్మన్‌శాస్త్రి జోషి తన గ్రంథం **'జోతిరావు పూలే (ఆంగ్లం)** పుస్తకంలో **(పుట.11)** 'ఒక మహమ్మదీయుని దగ్గర నుండి కొంత స్థలం అద్దెకు తీసుకున్నాడు', అని రాశారు. ఆ తరువాత **'సామాజిక విప్లవకారిణి సావిత్రీబాయి (సావిత్రీబాయి పూలే జీవితం-ఉద్యమం)'** శీర్షికతో **హైదరాబాద్ బుక్ ట్రస్ట్ 2017**లో ప్రచురించిన పుస్తకంలో చోటుచేసుకున్న **'సామాజిక విప్లవకారులు'** వ్యాసంలో వ్యాసకర్త **సింధియా స్టీపెన్** మాత్రం 'ఒక ముస్లిం వ్యక్తి తన భవనాన్ని పాఠశాల కోసం విరాళంగా ఇచ్చారు' (పుట.20) అంటూ ఉస్మాన్ షేక్ తన ఇంటిని ఆద్దెకు కాకుండా పాఠశాల ఏర్పాటుకు ఉచితంగా ఇచ్చారని పేర్కొన్నారు.

జోతిరావు పూలేకు మిత్రుడు ఉస్మాన్ షేక్ ఆపత్కాలంలో తన ఇంట ఆశ్రయం ఇచ్చి ఆదుకున్నాడన్న విషయాన్ని ప్రముఖ చరిత్ర పరిశోధకులు సయ్యద్ షాహ్ గాజియుద్దీన్ (షోలాపూర్, మహారాష్ట్ర) మాత్రమే కాదు 'ఫాతిమా షేక్' పేరుతో ఒక నవలను రచించి వెలువరించి ప్రముఖ చరిత్ర పరిశోధకులు, బహుగ్రంథ రచయిత దినకర్ విష్ణు కాకడే (మీరజ్, మహారాష్ట్ర), ప్రముఖ పాత్రికేయులు దిలీప్ మండల్, వందనా మీనన్, గాయత్రి మిశ్రా, అక్సా ఖాన్, సిద్ధాంత్ మోహన్, సుసే..జె తారూ; కె. లలిత, దివ్య కందుకూరి, దీప్తి నాగపాల్, పూనాకు చెందిన చరిత్ర పరిశోధకులు, బహు గ్రంథ రచయితలు డాక్టర్

నస్రీన్ రంజాన్ సయ్యద్, డాక్టర్ తాహెరా షేక్, డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, బిబిసి (తెలుగు) పాత్రికేయులు నశీరుద్దీన్, తదితర పలువురు రచయితలు, పరిశోధకులు, పాత్రికేయులు తమ పరిశోధనల పర్యవసానంగా లభించిన సమాచారాన్ని తమ గ్రంథాలలో, వ్యాసాలలో పొందుపర్చుతూ జోతిరావు పూలేను ఆదుకున్న ఉస్మాన్ షేక్ ఆయన చెల్లెలు ఫాతిమా షేక్ ఉదంతాన్ని విస్పష్టంగా వివరాలతో సహా ఉటంకించారు.

జోతిరావు పూలేను ఆయన తండ్రి గోవిందరావు పూలే తన ఇంటి నుండి వెళ్ళ గొట్టారన్న విషాదవార్తను తెలుసుకున్న జోతిరావు మేనత్త సగుణాబాయి తక్షణమే బయలుదేరి వచ్చి మున్షి గఫార్ బేగ్‌ను కలుసుకుంది. మిత్రుడు ఉస్మాన్ షేక్ జోతిరావుకు ఆశ్రయం కల్పించారని సమాచారం అందుకున్న సగుణాబాయి సంతోషిస్తూ ఉస్మాన్ షేక్ ఇల్లు చేరుకుంది. ఆప్పటి నుండి సగుణాబాయి తన మేనల్లుడి భార్య సావిత్రీబాయి, ఉస్మాన్ షేక్ చెల్లెలు ఫాతిమా షేక్‌లతో కలసి జోతిరావు పూలే కార్యక్రమాలకు చేదోడుగా నిలిచారు. 1854లో ఆమె మరణించేంత వరకు జోతిరావు పూలే కార్యక్రమాలలో ఆమె చురుగ్గా పాల్గొంటూ జోతిరావు సామాజికోద్యమానికి అండదండలు అందించారు. **(సత్యశోధక్ ఫాతిమా షేక్ (మరాఠి వ్యాసం), డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, పుట. 45).**

## ఆప్యాయంగా ఆహ్వానించిన ఫాతిమా షేక్

సామాజిక వ్యవస్థలో వేళ్ళూనికుని ఉన్న బానిసత్వ భావాలను తుడిచిపెట్టాలని, నిమ్నకులాలుగా ముద్రలు పడి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు కోల్పోవడంతో చదువుకు కూడా దూరం నెట్టబడిన జనసముదాయాలలో జ్ఞానజ్యోతులు వెలిగించాలన్న సంకల్పబద్ధుడైన జోతిరావు సంక్లిష్ట పరిస్థితుల సుడిగుండంలో సతమతం అవుతున్నప్పుడు ఉస్మాన్ షేక్ తోపాటుగా ఆయన చెల్లెలు ఫాతిమా షేక్ కూడా ఎంతో అభిమానంతో పూలే దంపతులను తమ ఇంటికి సాదరంగా ఆహ్వానించారు. ఆహ్వానించి ఆశ్రయమివ్వడం మాత్రమే కాదు ఆ అన్నా-చెల్లెల్లు పూలే దంపతులను అన్ని విధాలుగా ఆదుకున్నారు.

జోతిరావు పూలే ఆయన సతీమణి సావిత్రీబాయి పూలే ఇరువురు కూడా నిమ్నకులాల ప్రజానీకానికి, బాలికలకు విద్యగరపాలన్న సంకల్పబద్ధులై అవరోధాలను తట్టుకుంటూ దృఢనిశ్చయంతో ముందుకు సాగుతున్న విషయాన్ని ఫాతిమా షేక్ అర్థం చేసుకున్నారు. ఆ కారణంగా ఆ దంపతులు ఎదుర్కొంటున్న వ్యతిరేక పరిస్థితులను

కూడా తెలుసుకున్న ఫాతిమా షేక్ ఫూలే దంపతుల పట్ల గౌరవాభిమానాలను పెంచుకున్నారు. ఆ దంపతులను చూడాలని ఆమె ఉబలాట పడుతూ ఆ విషయాన్ని పలుమార్లు తన అన్న ఉస్మాన్ షేక్‌తో చెప్పారు. ఆ దంపతులను తప్పకుండా కలుపుతానని ఉస్మాన్ షేక్ చెల్లెలు ఫాతిమాకు అభయమిచ్చారు.

ఆ విధంగా ఫాతిమా షేక్ ఫూలే దంపతుల దర్శనం కోసం ఆమె ఎదురుతెన్నులు చూడసాగారు. ఆ సమయంలో అనూహ్యంగా, వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టయ్యింది. ఒక రోజున మున్షీ గఫ్ఫార్ బేగ్ ఫూలే దంపతులను తమ ఇంటికి తీసుకరావడం, జోతిరావు ఫూలే, సావిత్రీబాయి ఫూలేలకు ఆశ్రయం కల్పించాల్సిందిగా ఆయన కోరడం, అందుకు తన సోదరుడు ఉస్మాన్ షేక్ మారుమాట లేకుండా అంగీకరించడంతో ఫాతిమా షేక్ ఆశ్చర్యపోయింది, ఫూలే దంపతులు నేరుగా తమ ఇంటికి రావడంతో ఫాతిమా షేక్ ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. **(సత్యశోధక్ ఫాతిమాబీ షేక్ (వ్యాసం), వ్యాసకర్తః డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, పుట.44.)**

ఆర్థిక స్థితి కలిగి ఉన్న 'ఉస్మాన్ షేక్ తన మిత్రుడు జోతిరావు ఫూలే, ఆయన భార్య సావిత్రిబాయి ఫూలేను తమ ఇంటికి తీసుక రావడంతో సంబరపడిన ఫాతిమా ఫూలే దంపతుల్ని ఆప్యాయంగా ఆహ్వానించి, ఆత్మీయంగా చూసుకుంది. దుస్తులు, వంట పాత్రలతో వంట సామగ్రి అందించి అన్ని రకాలుగా సహాయపడింది' **(క్రాంతిజ్యోతి సావిత్రిబాయి ఫూలే, డాక్టర్ తాహెరా షేక్, పుట.56).** అన్న ఉస్మాన్ షేక్ లాగే చెల్లెలు ఫాతిమా షేక్ కూడా దయార్ద్ర హృదయురాలు కావటం మాత్రమే కాకుండా ఆనాటి సామాజిక వ్యవహారాల పట్ల అవగాహన, విశాల సానుకూల దృష్టి. సంస్కరణ దృక్పథం కలిగిన వారు కనుక ఆ అన్నా-చెల్లెల్లు ఇద్దరూ ఫూలే దంపతుల్ని అక్కున చేర్చుకున్నారు.

## సావిత్రీబాయిని హృదయానికి హత్తుకున్న ఫాతిమా

'సావిత్రీబాయి ఫూలే పుట్టిల్లు కూడా మంచి స్థితిమంతమైన కుటుంబం. వివాహం చేసుకుని అత్తింటికి వచ్చినప్పుడు ఇక్కడ కూడా అన్ని రకాల సౌకర్యాలుండేవి. అత్తగారైతే లేరు. కాని మామయ్య ప్రేమ, ఆప్యాయాలతో చూసుకునేవారు. అంతేకాకుండా తల్లిలా ప్రేమాభిమానాలు చూపేవారు. సావిత్రీబాయికి ఏ విషయంలోనూ ఎలాంటి ఆంక్షలు లేవు...అయితే ఇప్పుడు మామగారిలో వచ్చిన మార్పు ఆమెను భయాందోళనకు గురి

చేసింది. ఆమె పరిస్థితిని ఫాతిమా బాగా అర్థం చేసుకుంది. అందుకని సావిత్రీబాయిని ఆమె ఓదార్చుతూ ఉండేది. ధైర్యం చెబుతుండేది. ఆ ఇరువురు ఒకే చోట ఉంటున్నందున వారిరువురు పరస్పరం చాలా దగ్గరైపోయారు...ఆ కారణంగా సావిత్రీబాయి తన గ్రంథంలో ఈ విషయాన్నిలా పేర్కొన్నది. 'వారు అన్నివైపుల నుండి నిరాశ చెంది భయభ్రాంతులకు గురై ఇంటి నుండి వెళ్ళగొట్టబడినప్పుడు, తమకు ఆశ్రయం ఇచ్చే ధైర్యం ఎవరిలోనూ లేదు. ఆ గడ్డు సమయంలో ఉస్మాన్ షేక్, ఫాతిమా షేక్ మమ్మల్నీ ఆదుకుని మాకు ఆశ్రయం కల్పించారు' **(క్రాంతిజ్యోతి సావిత్రీబాయి ఫూలే, డాక్టర్ తాహెరా షేక్, అదిల్ పబ్లికేషన్స్, పూనా, 2000. పుట.56-57).**

ఈ విధంగా తలదాచుకోడానికి ఇల్లు దొరకడం మాత్రమే కాకుండా జోతిరావు ఫూలే భావాలతో ఏకీభవిస్తున్న విశాల హృదయుడైన మిత్రుడు ఉస్మాన్ షేక్, తమ పట్ల ప్రేమ, గౌరవాభిమానాలు పెంచుకున్న ఆయన చెల్లెలు ఫాతిమా షేక్‌ల ఆశ్రయం-ఆదరణ -ఆప్యాయతలూ ఫూలే దంపతులకు పుష్కలంగా లభించాయి. ఆ విధంగా జోతిరావు ఫూలే ఉద్యమ ఆరంభ దినాలలో మిత్రుడు, మిత్రుని సోదరి చేయూతతో మహోద్యమాన్ని నిర్మించిన జోతిరావు ఫూలే, సావిత్రీబాయి ఫూలే చరిత్రలో చిరస్మరణీయ ఖ్యాతిని ఆర్జించారు. జోతిరావు ఫూలే దంపతుల సత్సంకల్పానికి మద్దతు ప్రకటించి, ఆశ్రయ మిచ్చి ఆదుకున్న ఫాతిమా షేక్, ఉస్మాన్ షేక్ ఫూలే దంపతుల మహోద్యమంలో భాగస్వాములయ్యారు.

## మరాఠీ అభ్యసించిన ఫాతిమా

ఆర్థికంగా స్థిరపడిన కుటుంబానికి చెందిన ఫాతిమా షేక్ తన అన్న ప్రోత్సాహం వలన ధార్మిక విద్యతోపాటుగా ఉర్దూ భాషను కూడా నేర్చుకున్నారు. ఉర్దూలో చదవడం రాయడం వచ్చిన యువతిగా ఆమె సమాజాన్ని అర్థంచేసుకోగల చైతన్యం కలిగి ఉంది **(ఫాతిమా షేక్ ఔర్ చాంద్‌బీబి, డాక్టర్ నశ్రీన్ రంజాన్ సయ్యద్, జయిద్ పబ్లికేషన్స్ హౌస్, పూనా, 2018.).** అటువంటి యువతి తన ఇంటికి వచ్చిన ఫూలే దంపతుల లక్ష్యసాధనలో తన వంతు పాత్రను నిర్వహించాలని నిశ్చయించుకుంది. ఆమె నిర్ణయాన్ని ఆమె అన్న ఉస్మాన్ షేక్ కూడా సమర్థిస్తూ ఆ దిశగా ముందుకు సాగడానికి చెల్లెల్ని ప్రోత్సహించారు. ఆ నిశ్చయం మేరకు జోతిరావు ఫూలే, సావిత్రీబాయి ఫూలేలా తాను



ఫాతిమా షేక్ - సావిత్రీబాయి ఫూలే

కూడా విద్యాబోధన చేయాలంటే మరాఠి–ఆంగ్ల భాషల్లోని చదువు అభ్యసించాల్సిన అవసరం వచ్చింది. అందుకు ఫాతిమా షేక్ సంసిద్ధురాలై ఫూలే దంపతుల మార్గదర్శకంలో మరాఠి భాషను నేర్చుకునేందుకు ఆ దిశగా ప్రయత్నాలు ఆరంభించింది.

ఈలోగా ఉస్మాన్ షేక్ ఇంట కాస్త స్థిమితపడిన జోతిరావు ఫూలే తమ లక్ష్యాలకు అనుగుణంగా తమ పాఠశాలను పునఃప్రారంభించాలని నిర్ణయించి తగిన చర్యలకు పూనుకున్నారు. ఆయన నిర్ణయం పట్ల ఆనందాన్ని వ్యక్తంచేస్తూ తన ఇంటి ప్రాంగణంలోనే జోతిరావు ఫూలే తన పాఠశాలను ప్రారంభించ వచ్చని ఉస్మాన్ షేక్ తన మిత్రుడ్ని ప్రోత్సహించారు. తన మహత్తర లక్ష్యాల సాధనకు రూపొందించిన కార్యాచరణకు స్వజనులు, స్వంత కుటుంబీకులు ఏమాత్రం సహాయం అందించక పోగా వారి నుండి తీవ్రమైన వ్యతిరేకతను ఎదుర్కొంటూ ఇంటినుండి వెళ్ళగొట్టబడి మానసికంగా ఆవేదనకు గురవుతున్న జోతిరావుకు ఉస్మాన్ షేక్ తోడ్పాటు ఎంతో ఊరటతోపాటు ఉత్సాహాన్ని కలిగించింది. ఆ ఉత్సాహంతో జోతిరావు ఫూలే యధాప్రకారంగా సాహసోపేత నిర్ణయం తీసుకున్నారు. ఆయన INDIGENOUS LIBRARY పేరుతో 1848 జనవరి ఒకటిన

బాలికల పాఠశాలను ప్రారంభించారు. ఆరుగురు బాలికలతో ఉస్మాన్ షేక్, ఫాతిమా షేక్ ల క్రియాశీలక సహకారంతో ఉస్మాన్ షేక్ ఇంటి ఆవరణలో జోతిరావు దంపతులు బాలికల పాఠశాల ఆరంభించి సరికొత్త చరిత్రను సృష్టించారు.

## తొలి విద్యార్థిని ఫాతిమా షేక్

జోతిరావు పూలే ఆ నిర్ణయం తీసుకోగానే ఫాతిమా షేక్ మరాఠి భాషను నేర్చుకునేందుకు ఆ పాఠశాల తొలి విద్యార్థినిగా మారారు. ఆమె సావిత్రీబాయి పూలేతో పాటుగా ఆ పాఠశాలలో మరాఠి భాషను, ఇతర పాఠ్యాంశాలను అభ్యసించారు. విద్యాబోధన చేయడానికి సరిపడ మరాఠి భాషా జ్ఞానం ఫాతిమా షేక్ సంపాదించుకున్నారు. జోతిరావు ప్రారంభించిన ఆ పాఠశాలలో పాఠ్యాంశాల పరంగా ఇతర పాఠశాలలతో పోల్చితే విభిన్నంగా, ఆకర్షణీయంగా ఉండటం వలన ఆయా సామాజిక వర్గాల నుండి మంచి స్పందన లభించసాగింది. జోతిరావు పూలే ప్రారంభించినది 'బాలికల పాఠశాల కావడంతో, అందులో పనిచేసేందుకు మగవారెవరూ ముందుకు రాలేదు. అసలు, ఆ పాఠశాలకు తమ ఆడపిల్లలను పంపిచేందుకు తల్లితండ్రులు నిరాకరించేవారు. ఆడపిల్లలు చదవడం రాయడం నేర్చుకోవడమంటే 'చెడిపోవడానికి' తొలిమెట్టుగా వారు భావించారు. చదువుకోవడం అంటే ధర్మభ్రష్టత కలుగుతుందని వారు భావించారు' **(ఆధునిక భారత తొలి మహిళా టీచర్ సావిత్రీబాయి పూలే, బి.ఎం.లీలాకుమారి, దుర్గం సుబ్బారావు, సత్యశోధక్ వాయిస్, కర్నూలు, 2020, పుట.9).**

## ఉపాధ్యాయినిల కొరత

అటువంటి ప్రతికూల వాతావరణంలో బాలికల పాఠశాలలో విద్యాబోధనకు ఉపాధ్యాయినిల కొరత ఏర్పడింది. జోతిరావు బాలికల పాఠశాలలో సావిత్రీబాయి ఒక్కరే విద్యాబోధన చేయడం కష్టతరమయ్యింది. జోతిరావు పూలే పాఠశాలలో విద్యాబోధనకు బ్రాహ్మణేతర సామాజిక వర్గాలలో ఉన్న ఉపాధ్యాయినుల అవసరం వచ్చింది. ఆయా వర్గాలలో చదువుకున్న వారే మృగ్యమైనందున ఉపాధ్యాయినులు లభ్యం కావడం గగనకుసుమం అయ్యింది. ఆ తరుణంలో జోతిరావు ఆరంభించిన బాలికల పాఠశాలలో ఉపాధ్యాయురాలుగా స్వచ్ఛంద సేవలు అందించడానికి ఫాతిమా షేక్ సిద్ధపడ్డారు. బాలికల పాఠశాలలో విద్యాబోధన చేయాలని సంకల్పించుకున్న ఫాతిమా షేక్‌కు జోతిరావు

స్వయంగా ఉపాధ్యాయ శిక్షణ గరిపారు. ఆ శిక్షణా కార్యకలపాలను ఆయన స్వయంగా నిర్వహించారు. జోతిరావు పూలే తన పాఠశాల ప్రారంభానికి ముందు అహ్మద్‌నగర్ తదితర ప్రాంతాలలో మిషనరీలు నిర్వహిస్తున్న ఉపాధ్యాయ శిక్షణాలయాలను సందర్శించి అక్కడి బోధనా ప్రక్రియలను అవగతం చేసుకున్నారు.

ఆ కారణంగా సావిత్రీ బాయి, ఫాతిమా షేక్‌లకు శిక్షణ ఇచ్చేందుకు NATURAL SCHOOL పేరుతో ఉపాధ్యాయ శిక్షణాలయాన్ని ఏర్పాటు చేశారు. **(సంత్, మహాత్మా, విచారక్ ఔర్ ఇస్లాం (హిందీ), సంకలనంః సోమనాథ్ దేశ్‌కర్, సందేశ్ ప్రకాషన్, పూనా, 2014. పుట. 44).** ఆ శిక్షణాలయంలో ఉపాధ్యాయుడిగా జోతిరావు పూలే స్వయంగా సావిత్రీ బాయికి, ఫాతిమా షేక్‌కు శిక్షణ ఇచ్చారు. ఆ శిక్షణ పూర్తిచేశాక తమ పాఠశాలలకు వస్తున్న పిల్లలకు సావిత్రీబాయి పూలే, ఫాతిమా షేక్‌లు చదువు చెప్పడం ఆరంభించారు. ఆ ఇరువురు ఆ పాఠశాల విద్యార్థినిలుగా చదువుకోవడం మాత్రమే కాకుండా ఉపాధ్యాయునిలుగా ఆ పాఠశాలలోనే పిల్లలకు చదువు చెప్పటం విశేషం.

అప్పటి మిషనరీ పాఠశాలలోగాని, అగ్రవర్ణాల ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న గురుకులాలలో గాని చెప్పబడుతున్న పాఠ్యాంశాలకు జోతిరావు పూలే నిర్వహిస్తున్న పాఠశాలలో చెప్పబడుతున్న పాఠ్యాంశాలలో చాలా వైవిధ్యం కన్పించడం వలన చదవడానికి వీలులేదంటున్న సామాజిక వర్గాలలో జోతిరావు పూలే పాఠశాలలోని చదువు పట్ల ఆసక్తి పెరిగింది. ఆ కారణంగా జోతిరావు పూలే పాఠశాలలో అతిశూద్ర, శూద్ర, దళిత, బహుజన సామాజిక వర్గాల విద్యార్థినీ–విద్యార్థుల సంఖ్య క్రమంగా పెరగసాగింది. ఆ క్రమంలో జోతిరావు మరికొన్ని పాఠశాలలను వివిధ ప్రాంతాలలో ఏర్పాటు చేశారు.

## అహ్మద్‌నగర్ ఉపాధ్యాయ శిక్షణాలయంలో శిక్షణ

ఆ సమయంలో ఆయా పాఠశాలలలో విద్యాబోధన చేస్తున్న సావిత్రీబాయి, ఫాతిమా షేక్ లకు తాను అందించిన ఉపాధ్యాయ శిక్షణ సరిపోదని జోతిరావు భావించారు. ఆయన 'బాలికల పాఠశాల ప్రారంభించాలని తలపెట్టినప్పుడు అందులో ఉపాధ్యాయినిగా పనిచేసే అర్హత కోసం ఫాతిమా షేక్ అను ముస్లిం యువతితో కలసి ఉపాధ్యాయ శిక్షణ పొందింది సావిత్రీ' **(సామాజిక విప్లవకారిణి సావిత్రీబాయి (తెలుగు), వ్యాససంపుటి, వ్యాసంః ఉత్తమ ఉపాధ్యాయిని, నాయకురాలు, వ్యాసకర్త ః గేల్ అంవెట్, తెలుగు అనువాదంః కాత్యాయని, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 2017,పుట.28)**,

ఆ తరువాత ఉపాధ్యాయ శిక్షణ నిమిత్తం సావిత్రీబాయి పూలే, ఫాతిమా షేక్ అహ్మద్ నగర్‌లోని మేడం సింథియా ఫెరారే మిషనరీ పాఠశాలకు వెళ్ళి 'టీచర్ ట్రైనింగ్' పొందారు. ఆ పాఠశాలలో సావిత్రీబాయి, ఫాతిమా షేక్‌లు ప్రవేశ పరీక్షలు రాసి ఉత్తీర్ణత పొంది చేరారు. ఆ శిక్షణాలయం నుండి సావిత్రీబాయి, ఫాతిమా షేక్‌లు పూర్తి స్థాయి శిక్షణ పొందారు. **(ఫాతిమా షేక్ ఔర్ చాంద్‌బీబి, డాక్టర్ నస్రీన్ రంజాన్ సయ్యద్, జయిద్ పబ్లికేషన్స్ హౌస్, పూనా, 2018. పుట.11).** ఆనాడు పూనా నుండి అహ్మద్‌నగర్ వెళ్ళి ఒక మహిళ అదీ ఒక ముస్లిం మహిళ చదువుకోవడమంటే సాహసమే. ఆ సాహసాన్ని సావిత్రీబాయితో పాటుగా ఫాతిమా చేసింది. **(సోషల్ సైంటిస్ట్ సావిత్రిబాయి, సంగిశెట్టి శ్రీనివాస్, ఫోరం ఫర్ కన్సర్న్డ్ బీసీస్, హైదరాబాద్, 2020).**.

## శిక్షణ పొందిన తొలి ముస్లిం మహిళ ఫాతిమా

ఆ విధంగా ఆధునిక విద్యాబోధనకు అనుగుణమైన ఉపాధ్యాయ శిక్షణను పొంది సావిత్రీబాయి, ఫాతిమా షేక్ తిరిగి పూనా వచ్చారు. ప్రభుత్వ గుర్తింపు పొందిన ఉపాధ్యాయ శిక్షణాలయంలో పూర్తి స్థాయి శిక్షణ పొందిన తొలి ఉపాధ్యాయినులుగా సావిత్రీ బాయి పూలే, ఫాతిమా షేక్‌లు సర్టిఫికెట్లను కూడా సొంతం చేసుకున్నారు. **(ఉర్దూ పాఠ్యపుస్తకం, రెండవ తరగతి, బాలభారతి, మహారాష్ట్ర రాష్ట్ర ప్రభుత్వం ప్రచురణ, పూనా, 2013, పుట. 60).** ఆ తరువాత సావిత్రీబాయి, ఫాతిమా షేక్ ఇరువురు కలసి జోతిరావు పూలే స్థాపించిన పాఠశాలలో విద్యాబోధన చేయడం ఆరంభించారు.

జోతిరావు పూలే ఆరంభించిన పాఠశాలలో విద్యార్థినిగా ప్రవేశించి మరాఠి నేర్చుకుని ఆ తరువాత ఉపాధ్యాయ శిక్షణాలయంలో శిక్షణ పొందిన ఫాతిమా షేక్ తాను చదువుకున్న పాఠశాలలోనే ఉపాధ్యాయురాలుగా బాధ్యతలు నిర్వహించడం ఆరంభించారు. ప్రభుత్వం చేత గుర్తించబడిన అధికారిక ఉపాధ్యాయ శిక్షణాలయంలో ఉపాధ్యాయ వృత్తి విద్యా శిక్షణ పొంది సర్టిఫికెట్ పొందిన తొలి ముస్లిం మహిళగా ఫాతిమా షేక్ చరిత్ర సృష్టించారు. ఈమేరకు సాంప్రదాయక ధార్మిక విద్యలో కాకుండా సార్వజనీయ సాధారణ విద్యాబోధనకు నిర్దేశిత బోధనార్హతలను సాధించి విద్యారంగాన తగిన విద్యార్హతను సంతరించుకుని ఉపాధ్యాయురాలుగా పాఠశాలలో ఆధునిక విద్యాబోధన చేసిన **ప్రథమ ముస్లిం మహిళా ఉపాధ్యాయురాలు**గా ఫాతిమా షేక్ కొనియాడబడ్డారు. ఆ క్రమంలో సావిత్రీబాయి భారతదేశంలో **తొలి ఉపాధ్యాయురాలు**గా ఖ్యాతిగాంచారు.

## స్వచ్ఛందంగా సేవలకు సంకల్పించిన ఫాతిమా

జోతిరావు పూలే కార్యచరణ మేరకు సావిత్రీబాయి పూలే, ఫాతిమా షేక్ పూర్తి స్థాయి ఉపాధ్యాయురాళ్ళుగా స్వచ్ఛందంగా విద్యాబోధనకు సిద్దపడ్డారు. ఆ రోజులలో అతిశూద్ర, శూద్ర, బహుజన సామాజిక వర్గాలతోపాటుగా ముఖ్యంగా బాలికలకు విద్య గరపాలన్న లక్ష్యంతో ముందడుగు వేసిన జోతిరావు పూలే తీవ్ర ఆర్థికలేమిని ఎదుర్కొంటున్నారు. ఆయన ఆర్థిక పరిస్థితి ఏమీ బాగాలేదు. బ్రతుకుదెరువు కోసం సావిత్రీబాయి బొంతలను కూడా కొంతకాలం కుట్టారు. **(భారతాతీల్ పహీలీ ముసల్మాన్ శిక్షక్ః ఫాతిమా షేక్, దినకర్ విష్ణు కాకడే, సంఘమిత్ర పబ్లికేషన్స్, మీరజ్, 2019)** పాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయినులకు జీతం ఇచ్చే పరిస్థితి కూడా లేదు. ఆ పరిస్థితులలో కూడా జోతిరావు పూలే అప్రతిహతంగా తన లక్ష్యం దిశగా సాగడానికి బడుగు బలహీన వర్గాల విద్యార్థినీ- విద్యార్థులకు స్వచ్ఛందంగా విద్యాబోధన సేవలను అందించగల నిస్వార్థ, నిబద్ధతగల ఉపాధ్యాయులు–ఉపాధ్యాయినిల అవసరం ఏర్పడింది. **(క్రాంతిజ్యోతి సావిత్రి బాయి పూలే, డాక్టర్ తాహెరా షేక్, అదిల్ పబ్లికేషన్స్, పూనా, 2000. పుట. 58).** ఆ పరిస్థితులలో సావిత్రీబాయి పూలే, ఫాతిమా షేక్‌లు పాఠశాలల నిర్వహణ కమిటీల నుండి దమ్మిడి ఆర్థిక ప్రతిఫలాన్ని ఆశించకుండా అతిశూద్ర, శూద్ర సామాజికవర్గాల విద్యావసరాలను తీర్చడానికి ముందుకు వచ్చారు.

## ఉపాధ్యాయినిగా ఫాతిమా ప్రస్థానం ఆరంభం

ఈ మేరకు సామాజిక–ఆర్థికంగా సంక్లిష్ట పరిస్థితులను ఎదుర్కొంటూ జోతిరావు పూలే ప్రారంభించిన పాఠశాలలో బడుగు వర్గాల విద్యార్థులకు, వయోజనులకు చదువు చెప్పడం కోసం ఫాతిమా షేక్ కంకణబద్ధులయ్యారు. సంక్షుభిత సమాజంలో స్పష్టమైన సంస్కరణలను అభిలషిస్తూ విద్య ద్వారా సంపాదించిన జ్ఞానం మాత్రమే సంస్కరణల సాధనకు, మార్పుకు తోడ్పడగలదన్న విషయం మీద జోతిరావు పూలే, సావిత్రీబాయి పూలేల సహచర్యంలో మంచి సామాజిక అవగాహన సంతరించుకున్న ఫాతిమా షేక్ దళిత, బహుజన వర్గాల బాల–బాలికల విద్యాబోధన ఆరంభించారు. అతిశూద్ర, శూద్ర సామాజిక వర్గాలలో, ప్రధానంగా బాలికలలో విద్యా వ్యాప్తి గురించి ఒక నిర్ణయానికి వచ్చిన ఫాతిమా షేక్ తన అన్నయ్య ఉస్మాన్ షేక్ ప్రోత్సాహంతో జోతిరావు పూలే

మార్గదర్శకంలో సావిత్రీబాయి సహచర్యంలో తన పూర్తికాలాన్ని విద్యారంగానికి అంకితం చేసారు. బాలికలకు విద్యగరపడంలో పూలే దంపతులకు సహకరించాలని నిర్ణయించుకున్న ఫాతిమా షేక్ విద్యావ్యాప్తి దిశగా తన ప్రస్థానం ఆరంభించారు.

జోతిరావు పూలే ప్రారంభించిన పాఠశాలలు ప్రధానంగా దళితులు, బహుజన సామాజిక వర్గాల బాలికల కోసం ఉద్దేశించబడినవైనా బ్రాహ్మణులు, క్రైస్తవులు, ముస్లింల కుటుంబాలకు చెందిన పేద వర్గాల బాలికలకు కూడా ఆ పాఠశాలలో ప్రవేశం లభించేది. అందువలన బ్రాహ్మణులు, క్రైస్తవులు, ముస్లింల కుటుంబాలకు చెందిన పేద వర్గాల బాలికలను కూడా తమ పాఠశాలలో చేర్చుకోడానికి ఫాతిమా షేక్, సావిత్రీబాయి, సగుణాబాయి త్రయం ప్రయత్నాలు ప్రారంభించారు.

చివరకు ఆనాటి సామాజిక వ్యవస్థ విధించిన ఆచారసాంప్రదాయాలు, కట్టుబాట్లను ఖాతరు చేయకుండా సావిత్రీబాయి, సగుణాబాయితో కలసి ఎంతో సాహసంతో బాలికలలో విద్యాజ్యోతులను వెలిగించడానికి కంకణం కట్టుకుని ఫాతిమా షేక్ ముందుకు వచ్చారు. ఈ విధంగా 'ఆధునిక భారతదేశంలో విద్యార్థులకు చదువు చెప్పిన మొట్టమొదటి ముస్లిం మహిళ ఫాతిమా షేక్'గా ఆమె ఖ్యాతి గడించారు **(సోషల్ సైంటిస్ట్ సావిత్రిబాయి, సంగిశెట్టి శ్రీనివాస్, ఫోరం ఫర్ కన్సర్న్డ్ బీసీస్, హైదరాబాద్, 2020).**

## ఆగ్రహించిన ఆధిపత్యకుల పెద్దలు

పూర్వకాలంలో స్త్రీ విద్యను సమాజం ప్రోత్సహించేది కాదు. ఆడపిల్లలు ఇంటి పట్టున ఉండి ఏదైతే నేర్చుకుంటారో అదేవారికి చాలని అనుకునేవారు. మగపిల్లలను స్కూలుకు పంపించేవారు. ఆడపిల్లకు ఆ అవకాశం ఉండేదికాదు. **(ఉర్దూ పాఠ్యపుస్తకం, రెండవ తరగతి, బాలభారతి, మహారాష్ట్ర రాష్ట్రప్రభుత్వం ప్రచురణ, పూనా, 2013, పుట. 59)**. ఈ వాతావరణంలో జోతిరావు పూలే బడుగు వర్గాలకు, బాలికలకు విద్యగరపడానికి పాఠశాలలు ప్రారంభించడం, ఆ పాఠశాలల్లో బాలికలకు విద్యాబోధన గావించడానికి సావిత్రీబాయి, ఫాతిమా షేక్ ముందుకు రావడం ఆధిపత్యకులాల పెద్దలకు ఆగ్రహం కల్గించింది. మతం, కులం ఆచార సాంప్రదాయాలకు విరుద్ధంగా వ్యవహరించటం, కట్టుబాట్లను తమ ఆదేశాలను ఖాతరు చేయకుండా ముందుకు సాగుతున్న జోతిరావు పూలే బృందాన్ని ఇరకాటంలో పెట్టేందుకు ఏర్పాట్లు జరిగాయి. ఆ ప్రయత్నాలు ముందుగా



తరగతి గదిలో పాఠం చెబుతున్న ఫాతిమా షేక్

తిట్లు, శాపనార్థాలతో ఆరంభమయ్యి చివరకు భౌతిక దాడుల వరకు వెళ్ళాయి... 'కింది కులాల వారికి విద్యాబోధన చేయడం అరిష్టమంటూ జాతి నాశనమైపోతుందని సనాతన బ్రహ్మణులు ప్రచారం చేసింద్రు. అంతేకాదు దీనికి వ్యతిరేకంగా బ్రాహ్మణులను కూడ గట్టింద్రు' **(సోషల్ సైంటిస్ట్ సావిత్రిబాయి, సంగిశెట్టి శ్రీనివాస్,).**

## స్వజనుల వ్యతిరేకతనూ సహించిన ఫాతిమా

ఆనాటి సామాజిక ఆంక్షల కాలంలో ముస్లిం సామాజిక సముదాయం కూడా అందుకు అతీతంగా లేదు. 'ఆ కాలంలో ముస్లిం కుటుంబాల్లో అరబిక్ మరియు పర్షియన్ భాషల విద్యాబోధన ప్రైవేటు ఉపాధ్యాయులను పెట్టుకుని ఇళ్లల్లోనే ఇప్పించుకునేవారు. ఇంటి ఆడవాళ్ళు తమ స్వంత ఇళ్లల్లోనే విద్య నేర్చుకునేవారని **(క్రాంతిజ్యోతి సావిత్రిబాయి పూలే, డాక్టర్ తాహెరా షేక్, అదిల్ పబ్లికేషన్స్,పూనా, 2000. పుట.56)** డాక్టర్ తాహెరా వెల్లడించిన విషమ వాతావారణం చాలాకాలం సాగింది. ముస్లిం బాలికలు మాత్రమే కాదు బాలురు కూడా ఆధునిక విద్య నేర్చుకోడానికి కొందరు ఛాందస ముల్లాలు-మౌల్వీలు అడ్డుపడ్డారు. బాలికలు ఇంటి బయటకు వచ్చి విద్యగరపటం ఊహించలేని విషయం.

విద్యావ్యాప్తి లక్ష్యంగా పెట్టుకున్న ఫాతిమా షేక్ ఇంటి నుండి బయటకు వెళ్ళి పాఠశాలలో విద్యాబోధన చేయడం మాత్రమే కాకుండా బాలబాలికలను పాఠశాలలో చేర్చడానికి ఇల్లిల్లు తిరగడం చాలా సాహసోపేతమైన చర్య. సనాతన ఛాందసులకు ఇది అభ్యంతకరమైన ప్రవర్తన. ఆ కారణంగా ఫాతిమా షేక్ కూడా స్వజనం నుండి వ్యతిరేకతను ఎదుర్కోక తప్పలేదు. ఆనాడు ముస్లిం సమాజం నుండి ఫాతిమా షేక్ కు ఎంతటి మద్దతు లభించిందో చెప్పలేము గాని ఆనాటి పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని ఆలోచిస్తే జోతిబా దంపతుల్లాగే ఫాతిమా షేక్ కూడా తప్పకుండా వ్యతిరేకతను ఎదుర్కొని ఉంటారు. **(క్యా ఆప్ ఫాతిమా షేక్ కో జాన్‌తే హై? (హిందీ), చరిత్రకారుడు సుభాష్ గతాడే తో బిబిసి జర్నలిస్ట్, ఇక్బాల్ అహమ్మద్ సంభాషణ, 1 జనవరి 2017)**

ఈ విధమైన అడ్డుకట్టలు–ఆటంకాలు, ఆంక్షల దుస్థితి అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం స్థాపకుడు సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్ (1818–1898), 'బేగమ్స్ ఆఫ్ బోఫాల్'గా ఖ్యాతి గడించిన భోపాల్ బేగం సుల్తాన్ జహాన్ బేగం (1838–1901), చివరకు రొఖయా షెకావత్ హుసైన్ (1880–1932) లాంటి విద్యావేత్తలకు కూడా తప్పలేదు. 1901 నాటి ప్రభుత్వ లెక్కల ప్రకారం ముస్లింలలో చదువుకున్నవారు 9.83 శాతం ఉంటే మహిళలు 0.69శాతం ఉన్నారు. ఈ శాతాన్ని బట్టి ముస్లిం మహిళల్లో చదువుకున్న వారి సంఖ్య ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు. 1900 నాటికి బాలికలు విద్యగరపటం విషయంలో సామాజిక వ్యవస్థ ధోరణి, తీరుతెన్నులు అంత ప్రతికూలంగా ఉంటే 1848లో ఆ వ్యతిరేకత ఎంత తీవ్రస్థాయిలో ఉండి ఉంటుందో ఊహించవచ్చు.

## 'బేటీ పడావో' ఉద్యమానికి పునాదులు

ఒకవైపున కుల వ్యవస్థ కట్టుబాట్ల పరిరక్షణకు కంకణం కట్టుకున్న ఆధిపత్య కులపెద్దల వ్యతిరేకతను ఒకవైపున స్వజనులలోని ఛాందస మౌలానాలు–మాల్వీల ప్రతికూలతను మరొక వైపున ఫాతిమా షేక్ ఎదుర్కోవాల్సి వచ్చింది. ఆ సంక్లిష్ట కట్టుబాట్ల వాతావరణంలో కూడా ఫాతిమా షేక్ ఏ మాత్రం వెనకడుగు వేయలేదు. ఆమె ఎంతో ధైర్యంగా ప్రజలలోకి వెడుతూ విద్యావశ్యకతను వివరిస్తూ పాఠశాలలకు బాలబాలికలను పంపాల్సిందిగా కోరడం ప్రారంభించారు. బాలికల కుటుంబాలను కలసి బాలికలను చదివించమని తండ్రులను అభ్యర్థిస్తూ విద్యావ్యాప్తికి ప్రచార కార్యక్రమాలను చేపట్టారు.

'ఆమె ఇంటింటికి వెళ్ళి తల్లి తండ్రులకు నచ్చజెప్పి బాలికలను పాఠశాలలకు రప్పించ సాగారు' **(ఉర్దూ పాఠ్యపుస్తకం, రెండవ తరగతి, బాలభారతి, మహారాష్ట్ర రాష్ట్ర ప్రభుత్వం ప్రచురణ, పూనా, 2013, పుట. 60).** ఈమేరకు 170 ఏండ్ల క్రితమే బాలికల విద్యకోసం **'బేటీ పడావో'** ఉద్యమానికి ఫాతిమా షేక్ పునాదులు వేసారని చెప్పవచ్చు.

ఆ చర్యలతో జోతిరావు పూలే, సావిత్రీబాయి పూలేలతో పాటుగా ప్రస్తుతం ఫాతిమా షేక్ కూడా ఆధిపత్య కులాలలోని పెద్దలకు ప్రశ్నార్థకం అయ్యారు. పూలే దంపతులతోపాటుగా అగ్ర కులాల పెద్దలలో ఆమె కూడా చర్చనీయాంశమయ్యారు. ఆ సామాజిక వాతావరణంలో ఫాతిమా షేక్ ఎవ్వరికి వెరువక జోతిరావు పూలే మార్గదర్శకాల మేరకు సావిత్రీబాయి పూలే, సగుణాబాయిలతో కలసి తన కార్యక్రమాలను నిర్విఘ్నంగా సాగిస్తుండటంతో ఆధిపత్య కులపెద్దలు మండిపడ్డారు. జోతిరావు మరియు ఆయన అనుచరుల కార్యాచరణకు అడ్డుకట్ట వేయడానికి ఆలోచనలు సాగించారు. చిట్టచివరకు సావిత్రీబాయి, ఫాతిమా షేక్‌లకు ప్రతికూలంగా సమావేశాలు, చర్చలు, సాగించి ఆ ఇరువురిని నియంత్రించి నిరోధించడానికి దుష్ట పన్నాగాలకు పాల్పడ్డారు. ఆ వాతావరణాన్ని పట్టించుకోకుండా నిరంతరం విద్యాబోధనా కార్యక్రమాలను ఒకవైపున నిర్వహిస్తూ మరోవైపున విద్యావ్యాప్తికి అవసరమగు ప్రచార కార్యక్రమాలను చేపట్టి సగుణాబాయితో కలసి ఫాతిమా షేక్ ముందుకు సాగారు.

## ఫాతిమా విజ్ఞప్తులకు స్పందన

జోతిరావు పూలే మార్గదర్శకంలో, సావిత్రీబాయి సహచర్యంలో అతిశూద్ర, శూద్ర కులాల బాలికల తోపాటుగా ముస్లిం సమాజంలోని బాలికలకు కూడా ఆధునిక ఆంగ్ల విద్యను గరపాలని ఆశించిన ఫాతిమా షేక్ ఆ దిశగా కూడా దృష్టి సారించారు. జోతిరావు ప్రారంబించిన పాఠశాలలో హిందూ, క్రైస్తవ, ఇస్లాం మతాలకు చెందిన పేద కుటుంబాల బాలికలకు కూడా ఆయన ప్రవేశం కల్పించారు. ఆ కారణంగా ముస్లిం బాలికలను కూడా జోతిరావు పాఠశాలలో చేర్చడానికి అవకాశం ఏర్పడింది. ఆమె ముస్లింల ఇళ్ళకు వెళ్ళి బాలికల తల్లితండ్రులకు నచ్చజెప్పడం ఆరంభించింది. ఆనాటి ముస్లిం సమాజంలోని ముల్లాలు-మౌల్వీలు స్త్రీ విద్యకు వ్యతిరేకంగా ఉన్నా ఆ ఆక్షేపణలను, ఆంక్షలను ఏమాత్రం లెక్కచేయక ఫాతిమా షేక్ ప్రతి వీధి, ప్రతి ఇల్లు తిరుగుతూ

ముస్లిం కుటుంబాలలోని పిల్లల తల్లి తండ్రులకు బాలికల విద్యావశ్యకతను వివరించి బాలికలను పాఠశాలకు పంపాల్సిందిగా ఆమె చేసిన విజ్ఞప్తులకు క్రమంగా స్పందన లభించసాగింది. **(సత్యశోధక్ ఫాతిమా షేక్, డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, 'ముస్లిం సత్యశోధక్ పత్రిక', జూలై–ఆగస్టు 2020, పూనా, పుట.46).**

జోతిరావు ఆరంభించిన పాఠశాలల్లో ఫాతిమా షేక్ ప్రచార కార్యక్రమాల ప్రభావం వలన ముస్లిం బాలబాలికలు కూడా చేరసాగారు. ఈ విషయాన్ని ఆ పాఠశాలల్లోని ఒక పాఠశాలలో జరిగినట్టుగా వెల్లడవుతున్న సంఘటన రుజువుచేస్తుంది. ఆ సంఘటన ఏమిటంటే, ఒకసారి సావిత్రిబాయి పూలే పాఠశాలలో పాఠం చెబుతుండగా ఆ పాఠశాల గదిలోకి ఒక వ్యక్తి వచ్చి 'ముహమ్మద్' అను విద్యార్థి తన బిడ్డను కొట్టినందున తాను ఆ విద్యార్థిని కొడతానంటూ ఆగ్రహించాడు. ఆగ్రహం వ్యక్తంచేస్తూ తరగతి గదిలోకి వచ్చిన ఆ వ్యక్తిని సావిత్రీబాయి ఎంతో చాకచక్యంగా, ప్రోఫెషనల్‌గా నచ్చజెప్పి పంపారన్నది ఆ సంఘటన సారాంశం. **(ఆధునిక భారత తొలి మహిళా టీచర్ సావిత్రీబాయి పూలే, బి.యం.లీలావతి/దుర్గం సుబ్బారావు, సత్యశోధక్‌వాయిస్, కర్నూలు, 2020).** ఈ సంఘటన ద్వారా సావిత్రీబాయి శక్తియుక్తులు ఏపాటివో వెల్లడి కావడంతోపాటుగా ఆ పాఠశాలల్లో ముస్లిం బాలబాలికలు కూడా విద్యఅభ్యసించడానికి వచ్చారన్న విషయం విదితమౌతుంది.

## అడ్డుకట్టకు విఫలప్రయత్నాలు

జోతిరావు పూలే బాలికలకు, అతిశూద్ర, శూద్ర కులాల వారికి విద్యాబోధన చేయాలన్న సంకల్పంతో సాగిస్తున్న ప్రయత్నాలు మత, కుల కట్టుబాట్లకు, ఆచార సాంప్రదాయాలకు బద్ద వ్యతిరేకమని అగ్రవర్ణ, ఆధిపత్య కులాల పెద్దలు ప్రకటించారు. ఆ ప్రకటనల మేరకు ఆగ్రవర్ణ, ఆధిపత్య కుల నాయకులు జోతిరావును, ఆయన సహచరులను ఎలాగైనా సరే నిలువరించాలని నిశ్చయించుకున్నారు. ఆ నిర్ణయాల మేరకు ఆయనను, ఆయన సహచరులను భౌతికంగా అడ్డుకోడానికి ప్రయత్నాలు ఆరంభించారు.

ఆ అడ్డుకట్ట చర్యలలో భాగంగా బాలికలకు విద్య గరిపేందుకు పాఠశాలలకు వెడుతున్న సావిత్రీబాయి పూలే, ఫాతిమా షేక్‌లను భౌతికంగా అడ్డుకోడానికి సిద్ధపడ్డారు. ఆ అగ్రవర్ణాల పెద్దల ప్రేరరణతో, ఫాతిమా షేక్, సావిత్రీబాయి పూలే ఇరువురు పాఠశాలలకు వెళ్ళే మార్గంలో కొందరు ఆకతాయులు కాపుకాసి వారి రాకను గమనించి

మార్గమధ్యంలో అవరోధాలు కల్పించడం ఆరంభించారు. ఆ ఇరువురి రాకపోక సందర్భంగా రహదారుల్లో అడ్డం నిలచి వారిని చూస్తూ నవ్వుతూ హేళన చేయసాగారు. వెకిలి చేష్టలకు కూడా పాల్పడ్డారు. ఆ ఆకతాయిలు అంతటితో ఆగకుండా కొన్నిసార్లు వారి మీద రాళ్ళతో దాడులు కూడా చేశారు. **(ఉర్దూ పాఠ్యపుస్తకం, రెండవ తరగతి, బాలభారతి, మహారాష్ట్ర రాష్ట్రప్రభుత్వం ప్రచురణ, పూనా, 2013, పుట. 60)**.

ఒక మహత్తర లక్ష్యాన్ని నిర్దేశించుకుని సావిత్రీబాయితో భుజం భుజం కలిపి విస్మరించబడిన సామాజిక వర్గాంలో విద్యావ్యాప్తికి నిరుపమాన సేవలందిస్తున్న ఫాతిమా షేక్ రాకపోకలను అడ్డుకునేందుకు ఆకతాయిలు వారి బట్టల మీదకు అశుద్దాన్ని, బురద కూడా చల్లడానికి సాహసించారు. **(సత్యశోధక్ ఫాతిమా షేక్, డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, పుట. 46)**. 'ఆమె పైన పేడనీళ్ళు, బురద చల్లడం మాత్రమే గాకుండా ఆమె దారిలో వెడుతుంటే బూతులు కూడా మాట్లాడేవారు ... దాడులలో ఆడవాళ్ళుకూడా పాల్గొనేవారు.' **(సోషల్ సైంటిస్ట్ సావిత్రిబాయి, సంగిశెట్టి శ్రీనివాస్, ఫోరం ఫర్ కన్సర్న్డ్ బీసీస్, హైదరాబాద్, 2020).** అంతటి అఘాయిత్యాలు ఎదురవుతున్నా ఫాతిమా షేక్ మాత్రం సావిత్రీబాయి చేయి విడువ కుండా అతిశూద్ర, శూద్ర సామాజిక వర్గాల బాలికలకు విద్యగరపడానికి ఆమె సిద్దపడినందున సావిత్రీబాయి పూలేతోపాటుగా ఫాతిమా షేక్ కూడా అగ్రవర్ణాల, ఆధిపత్య కులపెద్దల ద్వారా ప్రేరేపించబడిన ఆకతాయిల అరాచకాన్ని పలుమార్లు పలు విధాల అనివార్యంగా చవి చూడాల్సి వచ్చింది.

## సడలని పట్టుదల – తెంపరితనానికి అడ్డుకట్ట

ఆధిపత్యకుల పెద్దల సైగల మేరకు ఆకతాయులు ఎన్ని అఘాయిత్యాలకు పాల్పుతున్నా ఫాతిమా షేక్, సావిత్రీబాయిలలోని పట్టుదల ఏమాత్రం సదలలేదు సరికదా మరింత బలపడింది. ఆకతాయిల చర్యలను సావిత్రీబాయి, ఫాతిమా షేక్‌లు ఆత్మ విశ్వాసంతో ధైర్యంగా ఎదుర్కొన్నారు. సావిత్రీబాయి సహచరిణిగా కూడా ఫాతిమా షేక్ అన్ని అవస్థలను ఎదుర్కొంటూ మొక్కవోని ధైర్యంతో ఆమె వెంట నడిచింది. చివరకు తల్లితండ్రులకు నచ్చజెప్పి పిల్లలను పాఠశాలలకు తీసుకెడుతున్న సావిత్రీబాయి, ఫాతిమా షేక్‌ను ఆధిపత్యకులాల పెద్దలు పలుమార్లు నిలదీసి అవాకులు చవాకులు పేలుతూ దుర్భాలాడిన సందర్భాలు కూడా లేకపోలేదు. ఆకతాయి తనపు చర్యలు ఎన్ని ఎదురైనా ఏమాత్రం

అదురుబెదురు లేకుండా ప్రశాంతంగా తమ పనులను తాము చేసుకపోతున్న ఆ ఇరువురు ఉపాధ్యాయినుల మీద భౌతికంగా దాడులకు కూడా ఆకతాయిలు పాల్పడినా నిబ్బరంతో, ధైర్యంగా తగిన సమాధానమిచ్చి ముందుకు సాగిన సావిత్రీబాయితో పాటుగా ఫాతిమా షేక్ అన్ని అష్టకష్టాలను కూడా భరిస్తూ ధైర్యంగా కర్తవ్య దీక్షతో ముందుకు సాగారు. **(సత్యశోధక్ ఫాతిమా షేక్ (మరాఠి వ్యాసం), డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, పుట.46)**.

## సావిత్రీబాయితో కలిసి నడిచిన ఫాతిమా షేక్

ఆధిపత్యవర్గాలు ఎన్ని అవరోధాలు కల్పించినా ఏమాత్రం వెనకడుగువేయక ముందుకు సాగిన జోతిరావు పూలే 1849 నాటికి పూనాలో మరో ఐదు బాలికల పాఠశాలలను, వయోజనుల పాఠశాలను ప్రారంభించారు. తొలి దశలో పాఠశాలలో ఒంటరిగా విద్య గరుపుతున్న సావిత్రీబాయికి ఫాతిమా షేక్ కూడా తోడుగా ఉండటం వలన ఆమె బరువు బాధ్యతలు కాస్త తగ్గాయి. ఆ తరువాత పూనాలో మాత్రమే కాకుండా పూనా బయట కూడా జోతిరావు పూలే పలు పాఠశాలలను స్థాపించి తమ స్థానిక కమిటీల ద్వారా వాటిని కూడా నిర్వహించారు.

బాలికల పాఠశాలతో ఆరంభమై వయోజనుల పాఠశాల, ఉపాధ్యాయ శిక్షణా పాఠశాలను జోతిరావు పూలే ఏర్పాటు చేశారు. ఆ క్రమంలో సామాజిక సేవ దిశగా దృష్టి సారించి బాల్యవివాహాలు ఫలితంగా చిన్నతనంలో వైధవ్యం పొందిన యువతుల సంరక్షణకు విధవ మహిళల ఆశ్రమం కూడా ఆరంభించారు. బాల్యవివాహాల వలన చిన్నతనంలో వైధవ్యం పొందిన యువతులు ఏకారణంగానైనా గర్భం ధరిస్తే వారికి పురుడుపోసి, వారికి పుట్టిన బిడ్డల సంరక్షణకు 'బాలహత్య ప్రతిబంధక గృహం' 1853 జూలై 12న ఏర్పడింది. ఈ కార్యక్రమం నిర్వహణకు సావిత్రీబాయి పూలేతోపాటుగా ఫాతిమా షేక్ కూడా ప్రసూతి శిక్షణను పొందారు. 1854లో కార్మికులు, రైతుల కోసం రాత్రి పాఠశాల ఆరంభించారు. మానవతా దృష్టితో పూలే దంపతులు ఆరంభించిన ప్రతి కార్యక్రమంలో ఫాతిమా షేక్ ప్రత్యక్షంగా, పరోక్షంగా తన క్రియాశీలక చేయూత ఇచ్చారు. **(సత్యశోధక్ ఫాతిమా షేక్ (మరాఠి వ్యాసం), డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, పుట.47)**. ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేకుండా ఇటు ఉపాధ్యాయినిగా, అటు సామాజిక సేవికగా, సంఘ సంస్కర్తగా, పూలే దంపతుల సహచరిణిగా వారు ఏర్పాటు చేసిన సంస్థలలో, నిర్వహించిన సామాజిక సేవా కార్యక్రమాలలో ఫాతిమా షేక్ పాల్గొన్నారు.



బిడ్డల్ని పాఠశాలకు పంపమని ప్రజలకు నచ్చజెబుతున్న ఫాతిమా షేక్ - సావిత్రీబాయి

## ప్రధానోపాధ్యాయినిగా ఫాతిమా షేక్

1856లో సావిత్రీబాయి తీవ్ర ఆనారోగ్యానికి గురయ్యారు. ఆ కారణంగా మహారాష్ట్ర రాష్ట్రం, సతారా (SATARA) జిల్లా, ఖండాలా (KHANDALA) తాలూకాలోని ఆమె పుట్టిల్లు నాయ్‌గావ్c (NAIGAON) గ్రామానికి ఆమె వెళ్ళాల్సి వచ్చింది. ఆ సందర్భంగా జోతిరావు పూలే విద్యాసంస్థలలో విద్యాబోధన, కార్యక్రమాల నిర్వహణ, పర్యవేక్షణ లాంటి అదనపు బాధ్యతలు కూడా ఫాతిమా షేక్ మీద పడ్డాయి. అనారోగ్యం వలన సావిత్రీబాయి నాయ్‌గావ్cలో మరింత కాలం అనివార్యంగా పుట్టింట ఉండాల్సి రావడంతో జోతిరావు పూలే పూనాలోని పాఠశాలల పర్యవేక్షణ, నిర్వహణకు ఫాతిమా షేక్‌ను ప్రధానోపాధ్యాయిని చేసి బోధనా బాధ్యతలతోపాటుగా పాఠశాలల యాజమాన్య బాధ్యతలు కూడా అప్పగించారు. ఆ బాధ్యతలను సమర్ధవంతగా నిర్వహించిన ఫాతిమా షేక్ శక్తిసామర్థ్యాలు సావిత్రీబాయి ప్రశంసలను అందుకున్నాయి. ఆధునిక భారత విద్యారంగంలో ఉపాధ్యాయ శిక్షణ పొందిన తొలి ముస్లిం మహిళగా మాత్రమే కాకుండా తొలి ముస్లిం ఉపాధ్యాయినిగా కూడా ఫాతిమా షేక్ చరిత్ర సృష్టించిన ఆమె ప్రస్తుతం

ప్రధానోపాధ్యాయినిగా బాధ్యతలు చేపట్టి తొలి ముస్లిం ప్రధానోపాధ్యాయినిగా కూడా ఇంకొక చరిత్రను సృష్టించారు. **(సత్యశోధక్ ఫాతిమా షేక్ (మరాఠి వ్యాసం), డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, పుట.47)**.

## ఫాతిమా చరిత్రకు ప్రాణం పోసిన సావిత్రీబాయి లేఖ

1856లో ఆరోగ్యం కుదుటపడక పోవడంతో సావిత్రీబాయి పుట్టింటిలో చాలా రోజులు గడపాల్సి వచ్చింది. అనారోగ్యంతో బాధపడుతున్నా కూడా సావిత్రీబాయి పూలే మనస్సు మాత్రం పూనాలోని పాఠశాలల నిర్వహణ మీదనే ఉంది. ఆమెకు తన సహచరి ఫాతిమా షేక్ శక్తి సామర్థ్యాలు, కార్యనిర్వహణ దక్షత మీద అపార నమ్మకం ఉన్నందున ఎటువంటి ఆందోళనకు గురికాకుండా ప్రశాంతంగా గడిపారు.

ఆరంభం నుండి తనతోపాటు ఉంటూ తమ కార్యక్రమాలన్నిటికి చేయూతను అందిస్తున్న సహోపాధ్యాయిని ఫాతిమా షేక్ మీద ప్రస్తుతం అధికభారం పడుతుందన్న ఆవేదన మాత్రం ఆమె మదిలో ఉంది. ఆ కారణంగా సావిత్రీబాయి తన బాధను కూడా వ్యక్తంచేసింది. అయితే ఫాతిమా షేక్ స్వభావాన్ని, పనితీరును, కార్యనిర్వహణా దక్షతను సమీపం నుండి చూసి అర్థం చేసుకున్న మహిళగా ఫాతిమా షేక్ ఏమాత్రం చికాకు పడకుండా తన బాధ్యతలను సమర్థవంతంగా నిర్వర్తించగదలదని కూడా సావిత్రీబాయి భావిస్తూ తన అభిప్రాయాన్ని స్పష్టంగా వ్యక్తంచేశారు.

## 1856 అక్టోబర్ 10 నాటి లేఖ

పుట్టింటిలో ఉన్న సావిత్రీబాయి పూనాలో ఉన్న తన భర్త జోతిరావుకు 1856 అక్టోబర్ 10 తారీఖున లేఖ రాశారు. ఆ లేఖలో తన గ్రామం నాయ్‌గాఁవ్ ప్రాంతంలోని సామాజిక పరిస్థితులు, తన సోదరుడితో సాగిన చర్చలు తదితర విషయాలను వివరిస్తూ సుదీర్ఘ లేఖ రాసారు. ఆ లేఖలో చివరకు తన ఆరోగ్యం గురించి ప్రస్తావిస్తూ '...నా ఆరోగ్యం పూర్తిగా కుదటబడింది. నేను జబ్బుతో ఉన్నన్నాళ్ళూ మా అన్నయ్య నన్ను కంటికి రెప్పలా చూసుకున్నాడు. ఆయన చూపిన శ్రద్ధ, చేసిన సేవలు చూస్తుంటే తనకు నామీద ఎంత ప్రేమోకదా అన్పించింది' **(సామాజిక విప్లవకారిణి సావిత్రీ బాయి (తెలుగు), వ్యాససంపుటి, వ్యాసంః జ్యోతిబాకు సావిత్రి రాసిన సాటిలేని ప్రేమలేఖలు, వ్యాసకర్తః సునీల్ సర్దార్, తెలుగు అనువాదంః కాత్యాయని, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 2017, పుట.49)** అని రాసారు.

ఆ తరువాత ఆ లేఖలో తన గురించి ఏమాత్రం బెంగపడవద్దంటూ భర్త జోతిరావు ఫూలేను సముదాయిస్తూ పూనాలోని పాఠశాలల నిర్వహణ గురించి ప్రస్తావించారు. 1856 నాటికి జోతిరావు పూలే ఇటు పూనాలో ఐదు పాఠశాలలు అటు పూనా బయట మరో 15 పాఠశాలలు ఏర్పాటు చేసి ఉన్నారు. ఆ పాఠశాలల నిర్వహణ బోధన విషయాలను జోతిరావు మార్గదర్శకంలో సావిత్రీబాయి, ఫాతిమా షేక్ నిర్వహిస్తూ, పర్యవేక్షిస్తూ వచ్చారు. ప్రస్తుతం అనారోగ్యం వలన సావిత్రీబాయి పూనాలో లేనందున, ఆమె త్వరితగతిన స్వగ్రామం నుండి పూనాకు రాలేకున్నందున ఆ పాఠశాలల నిర్వహణ, బోధన విషయాల భారం ఫాతిమా షేక్ మీద పడింది.

ఆ విషయం సావ్రితీబాయికి తెలుసు. తామిద్దరూ కలసి నిర్వహిస్తున్న కార్యక్రమాలను తన గైర్హాజరిలో ఫాతిమా షేక్ ఒంటరిగా నిర్వహించాల్సి వస్తున్న విషయాన్ని ఆమె అర్ధం చేసుకున్నారు. పాఠశాలల నిర్వహణ, బోధనల భారం ఫాతిమా నెత్తిన పడటం, తాను త్వరితగతిన పూనా చేరుకోలేని సంక్లిష్ట పరిస్థితిని ఆమె మననం చేసుకుంటూ పాఠశాలల నిర్వహణా విషయాన్ని ప్రస్తావిస్తూ ఫాతిమా నెత్తిన పడిన అధికభారం నేపధ్యాన్ని పేర్కొంటూ ఆ విషయాన్ని జోతిరావుకు రాసిన లేఖలో రాశారు.

ఆమె తన ఉత్తరంలో, **'ఇంకాస్త ఓపిక చిక్కగానే పూనేకు వచ్చేస్తాను. నా గురించి మీరేమీ బెంగపడకండి.** అని అంటూ **నేను అక్కడ లేక పోవటం వల్ల పాతిమా ఎంతో ఇబ్బంది పడి ఉంటుంది. ఐయినా ఆమె అన్ని విషయాలను అర్ధం చేసుకుంటుందని నాకు తెలుసు'** అంటూ ఫాతిమా షేక్ తన బాధ్యతలను చక్కగా నిర్వర్తించగలదన్న విశ్వాసాన్ని వ్యక్తం చేశారు. ఫాతిమా అన్ని విషయాలను అర్ధం చేసుకుంటూ పాఠశాలల నిర్వహణ సమర్ధవంతంగా నిర్వహించగలదు కనుక పాఠశాలల నిర్వహణ గురించి ఆందోళన చెంద వద్దంటూ సావిత్రీబాయి తన భర్త జోతిరావును ఆ లేఖలో ఊరడించారు. **(సామాజిక విప్లవకారిణి సావిత్రీ బాయి (తెలుగు), వ్యాససంపుటి, వ్యాసం: జ్యోతిబాకు సావిత్రీ రాసిన సాటిలేని ప్రేమలేఖలు, వ్యాసకర్త: సునీల్ సర్దార్, తెలుగు అనువాదం: కాత్యాయని, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 2017, పుట.49).**

ఈ విషయాన్ని. ప్రముఖ రచయిత్రులు Susie Tharu & K. Lalitha ల సంయుక్త సంపాదత్వంలో 1999లో The Feminist Press (Newyork) ద్వారా వెలువడిన WOMEN

WRITTING IN INDIA 600 BC TO THE PRESENT అను సుప్రసిద్ధ గ్రంథం మొదటి సంపుటంలోని 213 పుటలో, I'll come to Pune as soon as I have completely recovered. Please don't be worried about me. This must be causing a lot of trouble to Fatima. But I am sure she will understand and won't grumble' అని సావిత్రీబాయి తన లేఖలో రాసినట్టు పేర్కొన్నారు. ఈ వివరణను బట్టి సావిత్రీబాయి గైర్హాజరిలో ఫాతిమా షేక్ ఒంటరిగా పాఠశాలల నిర్వహణ, బోధన, పర్యవేక్షణ భారాన్ని బాధ్యతాయుతంగా, సమర్ధవంతంగా నిర్వహించారన్న విషయం సుస్పష్టం అవుతుంది.

## ఫాతిమాకు సావిత్రీబాయి ప్రశంసలు

జోతిరావు పూలే ఆరంభించిన పాఠశాలలో విద్యాబోధన, నిర్వహణ విషయంలో ఫాతిమా షేక్ శక్తిసామర్ధ్యాల మీద సావిత్రీబాయికి మంచి నమ్మకం ఉంది. పూనాలో తాను లేనందున కష్టతరమైన పాఠశాలల నిర్వహణా కార్యభారమంతా ఫాతిమా మీద పడినా ఆమె ఆ బాధ్యతలను సమర్ధవంతంగా నిర్వహించగలదన్న విషయం ఆమెకు బాగా తెలుసు. ఆ కారణంగా, ఆమె జోతిరావుకు ధైర్యం చెబుతూ **నేను అక్కడ లేక పోవటం వల్ల ఫాతిమా ఎంతో ఇబ్బంది పడి ఉంటుంది. అయినా ఆమె అన్ని విషయాలను అర్ధం చేసుకుంటుందని నాకు తెలుసు** అని రాయడం విశేషమేమీ కాదు.

అతిశూద్ర, శూద్ర సమూహాలలో, బాలికలలో విద్యావ్యాప్తి ఉద్యమంలో తన సహచరిణి ఫాతిమా షేక్ గురించి ప్రస్తావిస్తూ భారతదేశం తొలి మహిళా ఉపాధ్యాయినిగా ఖ్యాతి గడించిన ప్రసిద్ధ ఉద్యమకారిణి సావిత్రీ బాయి పూలే రాసిన ఆ వాక్యాలు ఎంతో ప్రాధాన్యత, ప్రాముఖ్యత తోపాటుగా, అత్యంత చారిత్రక విలువలను సంతరించుకున్నాయి. ఈ వాక్యాలు జోతిరావు పూలే, సావిత్రీ బాయి పూలేల చరిత్రతో పాటుగా ఫాతిమా షేక్ చరిత్రను కూడా చరిత్ర పుటలలో సమాంతరంగా నిక్షిప్తం కావడానికి, ఆలశ్యంగానైనా ఫాతిమా షేక్ సేవల చరిత్ర ప్రజల దృష్టిలోకి రావడానికి దోహదపడ్డాయి.

జోతిరావు పూలే దంపతుల సహచరిణిగా, ఆ దంపతుల కార్యక్రమాలలో, వ్యవస్థల, సంస్థల నిర్వహణలో వారికి తోడుగా నిలచిన ఫాతిమా షేక్ విద్య–సామాజిక సేవా కార్యకలాపాల చరిత్ర ప్రపంచానికి సాధికారికంగా వెల్లడికావడానికి సావిత్రీబాయి లేఖలోని ఈ వాక్యాలు ప్రధాన సాక్ష్యాధారాలుగా నిలిచాయి. ఆ రెండు విలువైన వాక్యాలు



బాలికలను పాఠశాలకు తోడ్కొని వెడుతున్న ఫాతిమా షేక్, సావిత్రీబాయి లను ప్రశ్నిస్తున్న అగ్రకుల పెద్దలు

చరిత్ర పుటలలో కనుక లేకున్నట్టయితే, అవి కనుక లభ్యం కాకున్నట్టయితే ఫాతిమా షేక్ చరిత్ర ప్రపంచం ఎరుకలోకి వచ్చే అవకాశం అంతగా ఉండేదికాదు.

ఆ పరంపరలో జోతిరావు ఫూలేను ఆయన తండ్రి ఇంటి నుండి బయటకు వెళ్ళగొట్టినప్పుడు ఆయనకు ఆయన భార్య సావిత్రీబాయి ఫూలేకు ఆశ్రయమిచ్చి ఆదుకున్న ఫాతిమా షేక్ సోదరుడు ఉస్మాన్ షేక్ చరిత్రగాని, జోతిరావు ఫూలే చదువును ఆయన తండ్రి మాన్పించినప్పుడు ఆయన తన చదువును పునఃప్రారంభించడానికి ఆయన తండ్రి గోవిందరావుకు నచ్చజెప్పి ఎంతగానో సహాయ పడిన మున్షీ గఫ్ఫార్ బేగ్ చరిత్రలు గాని వెల్లడయ్యే ఆవకాశాలు ఏమాత్రం ఉండేవికావు.

## ఆలస్యంగా జనబాహుళ్యంలోకి పూలే దంపతుల చరిత్రలు

జోతిరావు ఫూలే, ఆయన సతీమణి సావిత్రీబాయి ఫూలే పలు రచనలు చేశారు. కవితలు కూడా సృష్టించారు. పుస్తకాలు రాసారు. గ్రంథాలు ప్రచురించారు. అప్పటి బ్రిటిష్ అధికారులకు, వ్యక్తులకు, వ్యవస్థలకు, సంస్థలకు ఆ ఇరువురు పలు లేఖలు

రాశారు, పలు నివేదికలు సమర్పించారు. పలు సభలు, సమావేశాల్లో ప్రసంగించారు. ఆ కారణంగా ఆ దస్త్రాలన్నీ సురక్షితంగా ఉన్నాయి. ఆ దస్త్రాలలో పూలే దంపతుల చరిత్ర కూడా సురక్షితంగా నిక్షిప్తం అయ్యింది. ఆ కారణంగా జోతిరావు పూలే, సావిత్రీబాయి పూలేల కార్యక్రమాల గురించి పూనా, పూనా పరిసర ప్రాంతాల ప్రజల ఎరుకలో ఎంతో కొంత ఉన్నా కూడా పరిశోధకుల, చరిత్రకారుల పరిధిలోకి ఆలస్యంగా చేరాయి.

మహాత్మా జోతిరావుపూలే దంపతుల చరిత్ర మహారాష్ట్ర ప్రభుత్వ, ప్రభుత్వేతర దస్త్రాలలో, చరిత్ర పుటలలో నిక్షిప్తం అయినప్పటికి వారి నిరుపమాన సేవల చరిత్ర 1926 తరువాత మాత్రమే జనబాహుళ్యంలోకి చేరడం ఆరంభమయ్యింది. ఆ క్రమంలో 1939 తరువాత పూల్వంతి బాయి జొడాగే, డాక్టర్ యం.జి మాలి, డాక్టర్ కె.పి. దేశ్‌పాండే, ప్రొఫెసర్ హరి నార్కే తదితర ప్రముఖ చరిత్రకారులు, చరిత్ర పరిశోధకుల గ్రంథాల ద్వారా పూలే దంపతుల చరిత్ర ప్రజలకు చేరువ కాసాగింది.

మహారాష్ట్రలో పూలే దంపతుల చరిత్రలు ప్రజల ఎరుకలోకి రావడం ఆరంభం అయ్యాక 60 ఏండ్ల తరువాత 1930 దశకం నుంచి మహారాష్ట్రేతర ప్రాంతాల ప్రజలకు జోతిరావు, సావిత్రీబాయిల చరిత్రలు పరిచయమయ్యాయి. అప్పటి నుండి మరాఠి నుండి ఆంగ్లంలోకి గ్రంథాల అనువాదం జరిగాక ఆ గ్రంథాలను చాలా మంది తెలుగు రచయితలు తెలుగులోకి అనువదించడం ప్రారంభించారు. ఆ తరువాత డాక్టర్ కత్తి పద్మారావు (2008), దుర్గం రవీందర్, బి.యం లీలా కుమారి–దుర్గం సుబ్బారావు (2020) తదితరులు తెలుగులో గ్రంధాలను ప్రచురించారు. **(సోషల్ సైంటిస్ట్ సావిత్రిబాయి, సంగిశెట్టి శ్రీనివాస్, ఫోరం ఫర్ కన్సర్న్‌డ్ బీసీస్, హైదరాబాద్, 2020)**.

ఆ విధంగా జోతిరావు పూలే, సావిత్రీబాయి పూలే చరిత్రలు, వారి కార్యకలాపాల మీద, వారి రచనల మీద పలువురు రచయితలు అనువాదాలు, గ్రంథాలు వెలువరించారు. అసంఖ్యాకంగా వ్యాసాలు, చిరుపొత్తాలు వెలువడ్డాయి. స్వతంత్ర గ్రంథాలు కూడా ప్రచురితం అయ్యాయి. ఈ విధంగా పూలే దంపతుల ఉద్యమాల చరిత్ర తెలుగునేల మీద విస్తృతంగా అక్షర రూపం ధరించడానికి సుమారు 150 ఏండ్లకు పైగా పట్టింది.

## సావిత్రీబాయి సరసన ఫాతిమా షేక్

ఆ విధంగా వెలువడిన సాహిత్యం మూలంగా దళిత బహుజనవర్గాలలో వచ్చిన చైతన్యం కారణంగా ఆలస్యంగా నైనా మహాత్మా జోతిరావు పూలే ఉద్యమ నేపధ్యాన్ని,

ఉద్యమ చరిత్రను అక్షరబద్ధం చేయడం ఆరంభమయ్యింది. ఆ తరువాత మాత్రమే ఫూలే దంపతుల చరిత్ర తోపాటుగా ఫాతిమా షేక్ చరిత్ర కూడా క్రమంగా ఉనికిలోకి రాసాగింది. దళిత-బహుజన ఉద్యమకారులు తమ ప్రత్యేక సమస్యల మీద ఉద్యమించి ప్రజాస్వామిక పోరాటాలు చేస్తున్నప్పుడు బడుగు-బలహీన వర్గాలు జోతిరావు ఫూలే, సావిత్రీ బాయి ఫూలేలను 'ఐకాన్లు'గా స్వీకరించాక ఫాతిమా షేక్‌కు కూడా ఆ దంపతుల సరసన చోటివ్వడం ఆరంభించారు. భారతావని అంతట ఎక్కడ ఎటువంటి కార్యక్రమం జరిగినా ఆ కార్యక్రమంలో ప్రదర్శిస్తున్న జోతిబా ఫూలే, సావిత్రీబాయి ఫూలే చిత్రాలతో పాటుగా ఫాతిమా షేక్ చిత్రాన్ని కూడా జోడించటం, ఆ కార్యక్రమాలకు ప్రసంగీకులుగా వచ్చిన పెద్దలు తమ ప్రసంగాలలో జోతిబా దంపతులతో పాటుగా ఫాతిమా షేక్ తదితరులను ప్రస్తావించటం వలన ఫాతిమా షేక్ ప్రజా బాహుళ్యం ఎరుకలోకి రాసాగారు.

దళిత-బహుజన వర్గాల ఉద్యమకారులు, చరిత్రకారులు, రచయితలు, కళాకారులు ఎక్కడ ఏ ఉద్యమ కార్యక్రమం చేపట్టినా తమకు ఆదర్శనీయులగు మహాత్మా జోతిరావు ఫూలే, సావిత్రీబాయి ఫూలే స్మరణతో ఆరంభించటం, ఆ మహనీయుల చరిత్రలను మననం చేసుకోవడం ఆనవాయితి అయ్యింది. ఆ సందర్భంగా ఫూలే దంపతుల స్మరణతోపాటు ఎంతో గౌరవాభిమానాలతో ఫాతిమా షేక్ చరిత్రను ప్రస్తావించడం భాగమయ్యింది. ఆ ప్రస్తావనలతో పాటుగా ఫూలే దంపతుల సరసన ఫాతిమా షేక్ చిత్రాన్ని కూడా గౌరవప్రపత్తులతో ప్రదర్శించడం వలన ఫాతిమా షేక్ చరిత్ర ప్రజలకు క్రమంగా వెల్లడి కాసాగింది. ప్రధానంగా సావిత్రీబాయి ఫూలే కార్యక్రమాలను ప్రస్తావించిన ప్రతిసారి వక్తలు, ఉద్యమకారులు, పరిశోధకులు, చరిత్రకారులు, రచయితలు-కవులు, కళాకారులు ఫాతిమా షేక్‌ను కూడా ప్రస్తావించడం మాత్రమే కాకుండా, ఆమె చరిత్రకు అక్షర రూపం ఇవ్వసాగారు. ఆ కారణంగా ఫాతిమా షేక్ చరిత్ర చరిత్ర పుటల నుండి క్రమ క్రమంగా బయటకు వెల్లడి కాసాగింది. ఆ తరువాత దళిత-బహుజన ఉద్యమ శిబిరాలలో సావిత్రీబాయి చిత్రం ప్రదర్శితమైన ప్రతి చోట ఆమె సరసన ఫాతిమా షేక్ చిత్రాన్ని తప్పనిసరిగా ప్రదర్శించడం వలన ఫాతిమా షేక్ చరిత్ర దళిత-బహుజన సామాజిక వర్గాలను దాటి సామాన్య జన సమూహాల్లోకి ప్రవేశించి బహుళ ప్రాచుర్యంలోకి రాసాగింది.

అటు భారత దేశంలో, ఇటు తెలుగునాట నూతనంగా పుట్టుకొచ్చిన కొన్ని రాజకీయ పక్షాలు పూలే దంపతుల ప్రస్తావనలు బహు విధాలుగా చేశాయి. ఆ పక్షాలన్నీ కూడా బహుజన, దళిత, ముస్లిం ఓట్లను కొల్లగొట్టాలన్న లక్ష్యంతో సదరు పక్షాల నేతలు తమ ప్రసంగాలలో పూలే దంపతుల త్యాగాలను స్మరిస్తూ ఫాతిమా షేక్ సేవలను కూడా బహుముఖంగా ప్రశంసించడం ఆరంభించారు. జోతిరావు పూలే దంపతుల చిత్రాలతో పాటుగా ఫాతిమా షేక్ చిత్రాన్ని కూడా అనివార్యంగా ప్రధర్శించసాగారు. పూలే దంపతుల స్మరణతోపాటుగా ఫాతిమా షేక్‌ను స్మరించడం మాత్రమే కాకుండా మరింత ముందుకు సాగి జోతిరావు పూలేకు చిన్ననాట, పాఠశాలల ప్రారంభ సమయంతో సహాయ, సహకారాలు అందిచిన ఫాతిమా సోదరుడు ఉస్మాన్ షేక్, ఉపాధ్యాయులు మున్షీ గఫ్ఫార్ బేగ్‌ల సేవలను కూడా తరచుగా సభలలో, సమావేశాల్లో ప్రస్తావిస్తూ రావడం వలన ఫాతిమా షేక్ తదితరుల చరిత్ర ప్రజాబాహుళ్యంలోకి చేరసాగింది,

ప్రపంచ వ్యాప్తంగా సమాచార ప్రసార మాధ్యమాలలో అనూహ్యంగా దూసుకొచ్చిన సాంకేతికాభివృద్ధి, సరికొత్త ప్రసార సాధనాల కారణంగా, అంతర్జాలం, సామాజిక మాధ్యమాల ఉపకరణాల విజృంభణ వలన ప్రచారం ఉధృతమయ్యింది. ఆ తరువాత సమాచార ప్రసారం మరింత వేగాన్ని పుంజుకోవడం మాత్రమే కాకుండా సమాచారం చేరవేత కూడా అత్యంత సులభం కావడంతో ఫాతిమా షేక్, ఆమె సోదరుడు ఉస్మాన్ షేక్, మున్షీ గఫ్ఫార్ బేగ్‌ల చరిత్ర కూడా ప్రజలకు పరిచయం కాసాగింది.

## ఫాతిమా షేక్ చరిత్ర తెలిపే దస్త్రాల కొరత

ఆ విధంగా ఫాతిమా షేక్ చరిత్రను సుమారు నూటయాభై ఏండ్ల పాటు విస్మరించడం వలన, అలనాటి దస్త్రాలు, రచనలు కావాల్సినంత మేరకు అందుబాటులో లేనందున రచయితలకు, పరిశోధకులకు మౌఖిక సమాచారం మాత్రమే ఆధారం అయ్యింది. 1856లో సావిత్రీబాయి పూలే తన భర్తకు రాసిన లేఖలలో ఫాతిమా షేక్ గురించి చేసిన ప్రస్తావనల తరువాత మరెక్కడా కూడా సావిత్రీబాయి గాని, జోతిరావు పూలే గాని చివరకు ఆ ఇరువురి సహచరుల పుస్తకాలలోగాని, వారి దస్త్రాలలో గాని ఫాతిమా షేక్, ఉస్మాన్ షేక్, మున్షీ గఫ్ఫార్ బేగ్ ప్రస్తావనలు ఇంతవరకు కన్పించలేదు.

పూలే దంపతులతోపాటుగా విద్యావ్యాప్తి కార్యక్రమాలలో మాత్రమే కాకుండా, వారు నిర్వహించిన పలు సంఘ సంస్కరణ, సంఘ సేవా కార్యక్రమాలలో స్వయంగా పాల్గొన్న అక్షరయోధ ఫాతిమా షేక్ తన గురించిగాని, తన కార్యక్రమాల గురించి గాని రాసిన దస్త్రాలు, రచలను, నివేదికలు కూడా ఇంతవరకు వెల్లడికాలేదు. ఆ కారణంగా ఫాతిమా షేక్ సంపూర్ణ చరిత్ర ఆధార సహితంగా చరిత్రకారులకు, చరిత్ర పరిశోధకులకు లభించలేదు. ప్రస్తుతానికి ఫాతిమా షేక్ చరిత్ర అంతోఇంతో లభ్యమయ్యాక మహారాష్ట్రకు చెందిన పరిశోధకులు, చరిత్రకారులు, కవులు రచయితలు ఆమె సమాచారం రాబట్టడానికి శతవిధాల ప్రయత్నాలు సాగిస్తున్నారు.

మహారాష్ట్ర ప్రభుత్వం కూడా పూలే దంపతుల చరిత్రను మరింత లోతుగా అధ్యయనం చేసి అక్షరరూపం కల్పించడానికి ప్రత్యేక ప్రాజెక్టులను మరాఠా మేధావులకు అప్పగించింది. బహుజన–దళిత సామాజిక వర్గాలతోపాటు ముస్లిం సామాజిక వర్గానికి చెందిన కవులు, రచయితలు, చరిత్రకారులు, పరిశోధకులు దేశంలోని వివిధ ప్రాంతాల నుండి పూనా చేరుకుని పూలే దంపతుల, ఫాతిమా షేక్ చరిత్రను, సేవలను మరింత లోతుగా అధ్యయనం చేసి కొంగ్రొత్త విషయాలను కనిపెట్టి సాధికారిక సమాచారాన్ని ప్రజల ఎరుకలోకి తీసుకరావడానికి కృషి సల్పుతున్నారు.

## చరిత్రను చెప్పిన ఛాయాచిత్రం

స్వయంగా సావిత్రీబాయి పూలే తన సహోపాధ్యాయిని ఫాతిమా షేక్ గురించి వెల్లడించిన వాక్యాలు ఫాతిమా సేవల చరిత్ర వెల్లడికి ఎంతో ఉపయోగపడగా, సగుణాబాయి, సావిత్రీబాయి, ఫాతిమా షేక్ మరికొందరు బాలబాలికలతో కలసి ఉన్న అపురూప ఛాయాచిత్రం లభించటం చరిత్ర నిర్మాణానికి ఎంతో ఉపయుక్తమయ్యింది. ఈ చిత్రం ద్వారానే ఫాతిమా షేక్, సావిత్రీబాయిల స్వరూపం మాత్రమే కాకుండా వస్త్రధారణ కూడా ప్రపంచానికి వెల్లడయ్యింది. ఈనాడు భారతావని అంతటా మాత్రమే కాకుండా ప్రపంచ అంతటా సావిత్రీబాయి పూలే, ఫాతిమా షేక్‌ల వర్ణచిత్రాలుగా బహుళ ప్రచారంలో ఉన్న చిత్రాలకు ఈ ఛాయాచిత్రమే మూలం. ఈ ఛాయాచిత్రం ఆధారంగా చిత్రకారులు వివిధ పద్ధతులలో సావిత్రీబాయి, ఫాతిమా షేక్ చిత్రాలను రూపొందించి ప్రజల అందుబాటు లోకి తెస్తున్నారు.

ఈ ఛాయా చిత్రం ఫాతిమా షేక్, సావిత్రీబాయిల మధ్యనున్న సన్నిహిత స్నేహ సంబంధాలను తెలుపటం మాత్రమే కాకుండా ఆ ఇరువురు ఉపాధ్యాయినుల మధ్యనున్న సమాన స్థాయి సంబంధాలను కూడా వెల్లడిస్తుంది. చిత్రంలో ఫాతిమా, సావిత్రీబాయిలు పక్కపక్కన కుర్చీలలో ఆశీనులై ఉండటం గమనించి నట్లయితే ఆ ఇరువురు సమస్థాయి కలిగిన ఉపాధ్యాయినులన్న విషయాన్ని చిత్రం స్పష్టం చేస్తుంది. ఈ విధంగా అత్యంత చారిత్రక ప్రాధాన్యతగల ఈ ఛాయా చిత్రం ఫాతిమా షేక్, సావిత్రీ బాయి స్వరూపాలను ప్రపంచానికి పరిచయం చేయడం మాత్రమే కాకుండా వారి స్వభావాన్ని, వారి మధ్యనున్న సాన్నిహిత్యాన్ని కూడా బలంగా దృశ్యీకరిస్తుంది.

## ఛాయాచిత్రం ప్రామాణికత

చరిత్రలో అత్యంత ప్రాధాన్యతను సంతరించుకున్న ఈ ఛాయాచిత్రం లభ్యత వెనుక కూడా ఒక విశేషం ఉంది. ఆ విశేషం ఈ చిత్రం ప్రామాణికతను ధృవ పర్చుతుంది. BBC News Hindi ప్రసార విభాగం Journalist Mr Naseeruddin 'ఫాతిమా షేక్, సావిత్రీ బాయి కే సాత్ వంచితోం కో క్షిత్ కర్నే వాలి మహిళా' అను శీర్షికతో ప్రధానంగా ఫాతిమా షేక్ కు సంబంధించిన సమాచారంతో హింది భాషలో అందించిన ఆసక్తిదాయక కథనం తోపాటుగా ఈ చిత్రం లభ్యత వివరాలు కూడా సవివరంగా తెలిపారు.

ఆ బిబిసి పాత్రికేయుడు మిస్టర్ నశీరుద్దీన్ https://www.bbc.com/hindi/india-54069860 ద్వారా 2020 సెప్టెంబర్ 13న హిందిలో ప్రచురించిన వ్యాసంలో చారిత్రిక ఛాయాచిత్రం లభ్యత వివరాలు ఇలా పేర్కొన్నారు :

**" 'సావిత్రీబాయి ఫూలే సమగ్ర వాఙ్మయం' లో ఒక చిత్రం ఉంది. ఈ చిత్రంలో సావిత్రీబాయి పక్కన మరొక మహిళ కూర్చొని ఉంది. ఆమె ఎవ్వరో కాదు, ఆమె ఫాతిమా షేక్. ఈ ఫోటోలో ఉన్నది ఫాతిమా షేక్, సావిత్రీబాయి అను విషయానికి అన్నిటికన్నా పెద్ద రుజువు. అయితే ఆ చిత్రానికి సాక్ష్యం ఏది? డాక్టర్ యం.జి. మాలి తన సంపాదకత్వంలో వెలువరించిన 'సావిత్రీ బాయి ఫూలే సమగ్ర వాఙ్మయం'లో చాలా మహత్తరమైన సమాచారాన్ని వెల్లడించారు. సావిత్రీ బాయి చిత్రం చాలా సంవత్సరాల క్రితం పూనా నుండి వెలువడిన 'మజూర్' పత్రికలో ప్రచురితం అయ్యింది. ఈ పత్రిక 1924-1930 ప్రాంతంలో వెలువడింది. ఆ పత్రికకు ఆర్,యన్ లాడ్ సంపాదకులుగా**



పాఠశాలకు సావిత్రీ బాయి ఫూలే వెంట వెడుతున్న ఫాతిమా షేక్

పనిచేశారు. ఈ చిత్రం డి.యస్ జోడ్గే నుండి డాక్టర్ యం.జి. మాలికి లభించింది. డి.యస్ జోడ్గే కూడా కొంతకాలం మజూర్ పత్రిక సంపాదకులుగా ఉన్నారు. ఈ చిత్రానికి సంబంధించి అత్యధిక సమాచారం జోడ్గేగారి నుండి మాలిగారికి లభించింది. డాక్టర్ యం.జి మాలి ప్రకారంగా, 'లోకండే పేరుగల మిషనరీ ఒకరు రాసిన సుప్రసిద్ధ పుస్తకంలో సావిత్రీబాయి అరుదైన ఫోటో ఒకటి ప్రచురితం అయ్యింది. ఆ పుస్తకంలో ప్రచురితమయిన ఫోటో మజూర్ పత్రికలో ప్రచురించబడిన చిత్రం రెండూ ఒక్కలాగే ఉన్నాయి. ఆ అరుదైన ఫోటో నుండి సావిత్రీ బాయి చిత్రం రూపొందించబడింది. ప్రొఫెసర్ లీలా పాండే 'మహారాష్ట్ర కర్తవ్యశాలిని' పేరుతో రాసిన పుస్తకం ఒకటి **1966**లో వెలువడింది. ఆ పుస్తకంలో ఒక రేఖా చిత్రం ప్రచురితం అయ్యింది...ఆ పుస్తకంలోని రేఖా చిత్రం ఫోటోలో ఎటువంటి తేడాలేదు. నేను ఆ చిత్రంతోపాటుగా ఇతర పలు చిత్రాలను కూడా పరిశీలించాను. పూనాకు చెందిన ఏకనాథ్ పాల్కర్ వద్ద కూడా కొన్ని నెగిటివ్‌లు ఉండేవి. జోడ్గేగారికి ఆయన వద్ద నుండి ఈ నెగిటివ్ లభించింది. ఆ నెగిటివ్ నుండి సావిత్రీబాయి ఫూలే, ఫాతిమా షేక్ చిత్రాలు లభ్యమయ్యాయి. వంద

**సంవత్సరాల క్రితం నాటి నెగిటివ్‌ల నుండి తయారు చేసిన అరుదైన చిత్రమిది. ఈ నెగిటివ్ నుండి నాకు ఈ చిత్రం లభించింది'. ఈ చిత్రం లభించకుండా ఉండి ఉన్నట్టయితే ఫాతిమా షేక్ చిత్రమే కాదు సావిత్రీబాయి నీడ కూడా మనకు లభించి ఉండేది కాదు. మనం చూస్తున్న సావిత్రీబాయి చిత్రం ఆది ఇదే. ఈ చిత్రమే సావిత్రీబాయి లాగా ఫాతిమా షేక్‌ను కూడా ఒక చారిత్రక పాత్రగా ప్రకటించింది, ఫాతిమా షేక్ చరిత్రకు ప్రాణం పోసింది. ఆమెను మన ఎదుటకు తెచ్చి నిలిపింది".**

ఈ వివరణతోపాటుగా **'పూనాలోని పురాతన గృహం మరియు చరిత్ర సృష్టించిన మహిళలు'** శీర్షికతో అలనాటి ఫాతిమా షేక్ చారిత్రక పాత్రకు సాక్ష్యమిస్తున్న మరికొన్ని భౌతికాంశాలను బిబిసి పాత్రికేయుడు నశీరుద్దీన్ కళ్ళకు కట్టినట్టుగా పాఠకుల ముందు ఉంచారు. ఆనాడు జోతిరావు పూలే పూనాలో ఆరంభించిన తొలి బాలికల పాఠశాల గృహం ఎదుట ఈనాడు ఏర్పాటు చేసిన ఉన్న బోర్డు మీద సావిత్రీబాయి తోపాటుగా ఫాతిమా షేక్ చిత్రంతో పాటుగా ఇరువురి ప్రస్తావన ఉందన్న విషయాన్ని పేర్కొన్నారు.

ఈ విధంగా సావిత్రీబాయి పూలే, ఫాతిమా షేక్‌ల అరుదైన చిత్రాలను వర్తమానానికి అందించి ఆలనాటి చారిత్రిక వ్యక్తుల మహత్తర సేవలను ప్రపంచానికి తెలియ జెప్పడానికి ఎంతగానో దోహదపడిన వంద ఏండ్ల క్రితం నాటి ఛాయాచిత్రం లభ్యత వివరాలను పాత్రికేయులు నశీరుద్దీన్ సవివరంగా తెలిపి చరిత్ర నిర్మాణానికి ఎంతో దోహదపడ్డారు. ఆయన అంతటితో ఆగకుండా ఈనాటికి కూడా పూనా ప్రజలు 1848లో జోతిరావు పూలే ఆరంభించిన తొలి పాఠశాలను అనవాళ్ళను కాపాడుకుంటూ, ఆ పాఠశాలలో బాలికలకు విద్యాబుద్దులు గరిపిన తొలినాటి ఉపాధ్యాయినులు సావిత్రీ బాయి, ఫాతిమా షేక్‌లను కూడా ఎంతో గౌరవంగా స్మరించుకుంటున్న వాస్తవాన్ని నశీరుద్దీన్ మహారాష్ట్రేతర ప్రజానీకం దృష్టికి తీసుకురావడం అభినందనీయం, చరిత్ర ప్రేమికులు, చరిత్రపరిశోధకులు, చరిత్రకారులు ఆనందించదగిన విషయం.

## 1856 తరువాత ఫాతిమా ఏమయ్యారు ?

1856 నాటి సావిత్రీబాయి పూలే లేఖలో పేర్కొనబడిన ఫాతిమా షేక్ ఆ తరువాత ఏమాయ్యారో తెలియరావటం లేదు. 1856 తరువాత ఫాతిమా షేక్ గురించి ప్రస్తావించబడిన దస్త్రాలు గాని, లేఖలు గాని, ప్రస్తావనలు గాని ఇంత వరకు బహిర్గతం




సుమారు నూటా అరవై ఏండ్ల క్రితం నాటి సావిత్రీబాయి ఫూలే, ఫాతిమా షేక్, సగుణాబాయిల అపురూప ఛాయాచిత్రం. చిత్రంలో పాఠశాల విద్యార్థులను కూడా చూడొచ్చు.

కాలేదు. ఆమె సంపన్న వ్యాపారస్థుల కుటుంబ సభ్యురాలు మాత్రమే కాకుండా ఆధునిక విద్యావంతురాలు, ' ఆధునిక భారత ఆంగ్ల విద్యాబోధనకు అధికారిక శిక్షణ పొందిన తొలి ముస్లిం మహిళ', 'ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు', 'ఆధునిక భారత తొలి ముస్లిం ప్రధానోపాధ్యాయురాలు' గా విద్యా సేవలందించిన గొప్ప మహిళ ఫాతిమా షేక్ ప్రస్తావనలు ఇంత వరకు బహిర్గతం కాకపోవడం విచిత్రం అన్పిస్తుంది. ఆమె కేవలం విద్యాబోధనతో మాత్రమే సరిపెట్టుకోకుండా సావిత్రీ బాయి, జోతిబా పూలేలు ప్రారంభించిన అనేక సేవా సంస్థలలో కూడా స్వచ్ఛందంగా సేవలను అందించిన సామాజిక సేవకురాలు. ఏ విధంగా చూసినా ఆయా సంస్థల చరిత్రలలో కూడా ఫాతిమా షేక్ స్థానం ఏమిటో వెల్లడి కాకపోవడం మరింత విచిత్రం.

## ఫాతిమా షేక్ కు వివాహమయ్యిందా ?

అటు ఇటుగా సావిత్రీబాయి పూలే సమవయస్కురాలుగా భావించబడుతున్న ఫాతిమా షేక్ 1856 తరువాత ఏమయ్యారు? అను ప్రశ్నకు సమాధానంగా ఆమె వివాహం చేసుకున్నారని, ఆ వివాహాన్ని జోతిరావు పూలే, సావిత్రీబాయి పూలే స్వయంగా దగ్గరుండి ఫాతిమా వివాహం జరిపించారని పూనాకు చెందిన చరిత్రపరిశోధకులు డాక్టర్ షంషుద్దీన్ తంబోలి ప్రకటించారు. ఆయన సంపాదకత్వంలో వెలువడుతున్న 'ముస్లిం సత్యశోధక్ పత్రిక'లో ఆయన ఈ విషయాన్ని సవివరంగా పేర్కొన్నారు. పూలే దంపతులు దగ్గరుండి,కట్నరహిత ఆదర్శ వివాహాన్ని స్వయంగా జరిపించినట్టుగా ఆయన వివరించారు.

మహారాష్ట్ర రాష్ట్రంలోని మీరజ్‌కు చెందిన ప్రముఖ రచయిత దినకర్ విష్ణు కాకడే ప్రచురించిన 'భారతాతీల్ పహీలీ ముసల్మాన్ శిక్షక్ః ఫాతిమా షేక్' (సంఘమిత్ర పబ్లికేషన్స్, మీరజ్, 2019) పుస్తకానికి ప్రస్తావన రాసిన యస్.యం.ముశ్రిఫ్ (Mr S M Mushrif, IPS, Former Director General of Maharastra Police) ఫాతిమా షేక్ వివాహం విషయాన్ని వెల్లడించినట్టు డాక్టర్ షంసుద్దీన్ తన వ్యాసంలో ఉటంకించారు. **(సత్యశోధక్ ఫాతిమా షేక్ (మరాఠి వ్యాసం), డాక్టర్ షంషుద్దీన్ తంబోలి, పుట.47).**

ఈ విషయం గురించి రచయిత దినకర్ విష్ణు కాకడే 17-09-2020 న ఈ రచయితతో మాట్లాడుతూ తన గ్రంథంలో ఫాతిమా షేక్ వివాహం గురించి పేర్కొన్నట్టు తెలిపారు.ఆ వివాహం తరువాత ఆమె పుట్టింటి నుండి మెట్టినింటికి తరలి వెళ్ళిపోయారని,

ఆ కారణంగా 1856 తరువాత ఫాతిమా షేక్ గురించి ఎటువంటి వివరాలు, విశేషాలు తెలియకుండా పోయాయని దినకర్ విష్ణు కాకడే, డాక్టర్ షంషుద్దీన్ వెల్లడించారు. అత్యంత ప్రాధాన్యత సంతరించుకున్న ఇటు వంటి విశేషాలకు ఎటువంటి సాధికారిక ఆధారాలు లేనందున ఈ విషయాలన్నీ ఎంతవరకు వాస్తవమో పూర్తిగా నిగ్గుతేలాల్సి ఉంది.

## విస్తృతంగా మౌఖిక సమాచారం

అధికారిక దస్త్రాల పరంగా ఫాతిమా షేక్ వివరాలు ఏమీ తెలియకున్నా మౌఖికంగా చాలా సమాచారం పూనా నగరంలో ప్రచారంలో ఉంది. ఈ మౌఖిక సమాచారం ఎంత వరకు సత్యమోగాని ఫాతిమా షేక్ స్వరూప-స్వభావాలు కూడా మహారాష్ట్రకు చెందిన పలువురు రచయితలు, చరిత్రకారులు, చరిత్ర పరిశోధకులు వ్యక్తం చేస్తూ నవలలు, కవితలు, వ్యాసాలు, పుస్తకాలు రాస్తున్నారు. ఆ రచనల ఆధారంగా ఫాతిమా షేక్ వివరాలు కొంతలో కొంత మహారాష్ట్రేతర ప్రజానీకానికి తెలుస్తున్నాయి. మహారాష్ట్ర ప్రభుత్వం కూడా తమ అధికారిక దస్త్రాలలో, పాఠ్య పుస్తకాలలో ఫాతిమా షేక్ గురించి ప్రస్తావించడం, ఆమె గురించిన పాఠ్యాంశాలు పాఠ్య గ్రంథాలలో పొందు పర్చడం వలన ఆమె చరిత్ర కనుమరుగు కాకుండా బ్రతికి బట్ట కట్టగలుగుతుంది.

## ఫాతిమా షేక్ జననం-మరణం

ఈ రకమైన మౌఖిక సమాచారం ఆధారంగా పూనా ప్రజానీకం మాత్రమే కాదు మహారాష్ట్ర ప్రజలు కూడా ఫాతిమా షేక్ 1832 సెప్టెంబర్ 21న జన్మించారని, 1900 అక్టోబర్ తొమ్మిదిన కన్నుమూసారని భావిస్తున్నారు. జనవరి తొమ్మిదిన, 1831 అమె జన్మించారని కూడా చెబుతున్నారు. అక్కడితో ఆగకుండా స్వచ్ఛంద సంస్థలు, ప్రజలు స్వయంగా నిర్ధారించుకున్న తేదిలలో ఫాతిమా షేక్ జయంతి, వర్ధంతి జరువుకుంటున్నారు. గత కొద్ది ఏండ్లుగా ప్రతి ఏడాది మహారాష్ట్ర లోని వివిధ సంస్థ, ప్రజా సంఘాలు, దళిత- బహుజనుల సంస్థలు చివరకు రాజకీయ పక్షాలు ఎటువంటి సంకోచం లేకుండా నిర్వహిస్తున్న ఫాతిమా షేక్ జయంతి-వర్ధంతి కార్యక్రమాల నిర్వహణ ప్రతిఏటా సోషల్ మీడియాలో విస్తృతంగా ప్రచారం అవుతున్నాయి.మన తెలుగు రాష్ట్రాలలో 1831 జనవరి తొమ్మిదిన ఆమె జన్మదినంగా ప్రచారంలో ఉంది. ఈ తేదిలను నిర్ధారించే దస్త్రాలు కాని, ప్రామాణిక గ్రంథాలు కాని మాత్రం లేకపోవడం విశేషం.

# ఫాతిమా షేక్‌కు చారిత్రక అన్యాయం

సుమారు 170 ఏండ్ల క్రితం, అలనాటి సామాజిక పరిస్థితుల ఆంక్షలను, కుల కట్టుబాట్లను, మత ఛాందసుల ఆక్షేపణలను తట్టుకుంటూ దళిత–బహుజనవర్గాల ప్రజానీకం తోపాటుగా అన్ని సామాజిక జనసముదాలలోని బాలికలలో జ్ఞానజ్యోతులను వెలిగించాలన్న మహత్తర లక్ష్యంతో ముందుకు సాగి మహాత్మా జోతిబా ఫూలే, సావిత్రీబాయి ఫూలేలకు పూర్తి స్థాయిలో సహకారం అందించిన ఫాతిమా షేక్ కు చారిత్రక అన్యాయం జరిగిందని చెప్పుకోవచ్చు. అతిశూద్ర, శూద్ర సామాజిక వర్గాలకు, బాల–బాలికలకు విద్య గరపాలని ఎంతో ఉత్సాహంతో మరెంతో సాహసంతో ముందడుగు వేసిన ఫాతిమా షేక్ తన సామాజిక వర్గంలోని బాలబాలికలకు కూడా విద్యగరపాలని గట్టిగా ప్రయత్నించారు. ఆనాటి ఆమె ప్రయత్నాలు సత్ఫలితాలను కూడా సాధించాయి.

ఆ పరిస్థితులలో అతిశూద్ర, శూద్ర సామాజిక వర్గాల నుండి వచ్చిన మేధావి వర్గం అలనాటి మహాత్మా జోతిరావు ఫూలే, సావిత్రీబాయి ఫూలేల చరిత్రను వెలికి తీసి ప్రతి విశేషాన్ని అక్షరబద్ధం చేసేందుకు ప్రయత్నించారు. ఇప్పటికి ప్రయత్నిస్తున్నారు. ఆ సమయంలో ఫాతిమా షేక్ సామాజిక వర్గానికి చెందిన మేధావులు, చరిత్రకారులు, చరిత్ర పరిశోధకులు ఎందుకు ఆ దిశగా ప్రయత్నాలు చెయ్యలేదో అర్థం కావడంలేదు. ప్రయత్నాలు చేసినా ఫలితం దక్కలేదా అనేది కూడా తెలియడం లేదు.

ఈ విషయమై మరికొందరు ఫాతిమా షేక్ చరిత్ర వెల్లడి కాకుండా కొందరు అడ్డుపడుతున్నారని ఆరోపణలు చేస్తున్నారు. ఆ ఆరోపణల మాట ఎలాగున్నా తాము ఏమి చేసామన్నది ముస్లిం సామాజిక వర్గం తనకు తాను ప్రశ్నించుకోవాల్సిన అవసరం ఉంది. సుమారు 170 సంవత్సరాల క్రితం తనకు తానుగా లక్ష్యాన్ని నిర్దేశించుకుని ఆధునిక విద్యను అభ్యసించి, చదువు చెప్పడానికి అర్హతలను సంపాదించి, స్వచ్ఛందంగా విద్యాసేవలను అందించడానికి నడుంకట్టిన ఆధునిక విద్యారంగం తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు, ఆధునిక విద్యారంగం తొలి ముస్లిం ప్రధానోపాధ్యాయురాలు ఫాతిమా షేక్ చరిత్రను ముస్లిం సామాజిక వర్గం నమోదు చెయ్యకుండా విస్మరించడం విచారకరం.

## నా ప్రయత్నాలనూ నిరుత్సాహపర్చారు

నా అధ్యయనంలో ఫాతిమా షేక్ గురించి కాస్తోకూస్తో తెలుసుకున్నాక ఆమె గురించి రాయాలన్న ఆలోచన 2019లో కలిగింది. ఆ ఆలోచనను ఆచరణలో పెడదామని ప్రయత్నం ఆరంభించాను. ఆ సందర్భంగా మహారాష్ట్రకు చెందిన ఒక రచయిత, చరిత్ర పరిశోధక మిత్రులొకరిని ఫాతిమా షేక్ సమాచారం కోసం సంప్రదించాను. నా వినతి పూర్తిగా వినకుండానే ఆయన నన్ను నిరుత్సాహపర్చారు. ఫాతిమా షేక్ కంటె ముందుగా ముస్లిం సమాజంలో ఉపాధ్యాయినులు లేరనటం సత్యదూరమంటూ ఫాతిమా షేక్ తొలి ముస్లిం ఉపాధ్యాయిని ఎలా అవుతుందని నా మీద పలు ప్రశ్నల వర్షం కురిపించారు. ఆ సమయంలో ఫాతిమా షేక్ గురించి నావద్ద తగినంత సాధికారిక సమాచారం లేనందున అప్పట్లో ఫాతిమా షేక్ చరిత్ర లిఖించే ప్రయత్నం మానుకున్నాను.

ఈ ఏడాది మళ్ళీ ఫాతిమా షేక్ గురించి రాయడానికి సంకల్పించి మహారాష్ట్ర, షోలాపూర్ చరిత్రకారులను మళ్ళీ సంప్రదించి ఆమె సమాచారం కోరాను. అప్పట్లో ఎదురైన ప్రశ్నలే మళ్ళీ నాకు ఎదురయ్యాయి. ఈసారి మాత్రం నా వద్ద సాధికారిక సమాచారం అంతో ఇంతో ఉండటం వలన, ఆధునిక భారత విద్యారంగంలో విద్యాబోధన చేయడానికి అధికారిక శిక్షణ పొందిన తొలి ముస్లిం మహిళ ఫాతిమా షేక్ కదా అంటూ ఆమె మిగతా ప్రత్యేకతలను ఉటంకిస్తూ ఆయన వాదనను పూర్వపక్షం చేయడంతో మీ ఇష్టం అంటూ తన అసంతృప్తిని వ్యక్తం చేస్తూ మిన్నకుండి పోయారు. ఈ పరిస్థితులను గమనిస్తే స్వస్థలం పూనాలో మాత్రమే కాదు స్వరాష్ట్రం మహారాష్ట్రలో కూడా ఫాతిమా షేక్‌కు చారిత్రక అన్యాయం జరిగిందన్పిస్తుంది.

## విస్మయం కలిగించే విషయం

మహాత్మా జ్యోతిరావు పూలే, అయన సతీమణి సావిత్రీబాయి పూలే పలు రచనలు చేసారు. అసంఖ్యాకంగా లేఖలు రాశారు. ప్రభుత్వాధికారులకు మహాజర్లు సమర్పించారు, నివేదికలు అందించారు. దస్త్రాలు రూపొందించారు. పలు సభలు సమావేశాలు నిర్వహించారు. వ్యక్తులు, వ్యవస్థలు నిర్వహించిన పలు సభలు, సమావేశాలలో స్వయంగా పాల్గొన్నారు. ఆయా సంస్థలలో పాల్గొని చేసిన ప్రసంగాలు, వ్యక్తీకరించిన అభిప్రాయాలకు అక్షర రూపం కల్పించారు. ఆ రచనలలో తమ సహచరుల

కార్యకలాపాల గురించి అందించిన సేవల గురించి కూడా రాసారు, పూలే దంపతుల ప్రస్థానం ఆరంభం నుండి ఎంతగానో సహకరించిన ఉస్మాన్ షేక్-ఫాతిమా షేక్‌ల గురించి ఆ ప్రస్తావనలలో కించిత్తు సమాచారం కూడా లేకపోవడం విస్మయం కల్గిస్తుంది. అనారోగ్యం వలన సావిత్రీబాయి పుట్టింటికి వెళ్ళినప్పుడు ఆమె స్థానంలో పాఠశాలల నిర్వహణ, బోధనా కార్యక్రమాలను పర్యవేక్షించిన, ప్రధానోపాధ్యాయినిగా వ్యవహరించిన ఫాతిమా షేక్ ప్రస్తావనలు ఏమాత్రం కన్పించకపోవడం ఆశ్చర్యం అన్పిస్తుంది.

ఉపాధ్యాయురాలు, సంఘసేవిక, సంఘసంస్కర్త, చైతన్యవంతురాలు అయిన మహిళ ఫాతిమా షేక్ అయిన ఏమైనా రాసారా? లేక ఏమీ రాయలేదా? ఏమీ తెలియడం లేదు. ఒకవేళ రాస్తే లేక రాసి ఉంటే ఆమె రాసిన కథనాలు ఏమయ్యాయి? అవన్నీ ఎక్కడున్నాయి? అసలు ఉన్నాయా లేదా? అమె ఏమీ రాయకుండా ఎందుకున్నారు? విద్యావంతురాలయిన ఆమె తన బంధువులకు, మిత్రులకు లేఖలు కూడా రాయలేదా ? లాంటి పలు సందేహాలు- ప్రశ్నలు ఉత్పన్నమవుతున్నాయి.

## ముమ్మరంగా సాగుతున్న శోధనలు-పరిశోధనలు

ఈ మేరకు ఎన్ని ప్రశ్నలు ఉత్పన్నం అయినప్పటికి ఆమె రాసినట్టుగా ఇప్పటి వరకు ఎటువంటి సమాచారం అందుబాటులోకి రాలేదంటున్నారు మహారాష్ట్ర, పూనాకు చెందిన చరిత్రకారులు, చరిత్ర పరిశోధకులు. ఆ కారణంగా ఆమె ఏమీ రాయలేదన్న భావన వెల్లడవుతుంది. అయినప్పటికి మహాత్మా జోతిరావు పూలే, సావిత్రీబాయి పూలే చరిత్రలు వెలుగులోకి రావడం ఆరంభించిన తరువాత, ఆ చరిత్రలు విస్తృతంగా ప్రజలలో వ్యాప్తి చెందుతుండటంతో ప్రస్తుతం ప్రభుత్వం తోపాటుగా పలువురు చరిత్ర పరిశోధకులు, చరిత్రకారులు ఫాతిమా షేక్ చరిత్ర మీద దృష్టి నిలిపారు. ఫాతిమా షేక్‌కు జరిగిన చారిత్రక అన్యాయాన్ని సరి చేసేందుకు కృషి ముమ్మరంగా జరుతుంది. ఫాతిమా షేక్ వివరాలను రాబట్టేందుకు అన్వేషణ ఆరంభించారు. ఆ శోధనలు, పరిశోధనలు అటు ప్రభుత్వ పరంగా ఇటు ప్రజల పరంగా కూడా ముమ్మరంగా సాగుతుండటం ఆహ్వానించదగిన పరిణామం, సంతోషించదగ్గ విషయం. ◆

# అనుబంధం

'ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్' గ్రంథ రచనకు ఉపక్రమించిన నేను తగిన సమాచారం కోసం అన్వేషణ సాగిస్తున్న సమయంలో అసక్తికరమైన సరికొత్త విశేషాంశం నా దృష్టికి వచ్చింది. ఆ ఆసక్తిదాయక ఈ సమాచారాన్ని కూడా తెలుగు పాఠకులకు అందజేయాలన్న భావనతో గ్రంథం చివర అనుబంధం జోడిస్తున్నాను.

మహాత్మా జోతీరావు పూలే తన జీవిత కాలంలో సృష్టించిన సాహిత్యంలో భాగంగా రెండు 'పవాడా' (Pawada) లు రాశారట. పవాడా అంటే 'స్తుతిగీతం'గా అర్థం చేసుకోవచ్చు. ఆంగ్లంలో Poem of Apreciation or Ballad అని చెప్పుకోవచ్చు. మహాత్మా పూలే ఆ స్తుతి గీతాలను ఒకటి ఛత్రపతి శివాజి మహారాజ్ మీద రెండవది ప్రవక్త ముహమ్మద్ (స) మీద రాశారు. ఈ స్తుతిగీతాన్ని మహాత్మా పూలే 'మానవ్ ముహమ్మద్' శీర్షికతో సృజియించారు. ఆ గీతాన్ని ఆయన దత్త కుమారుడు యశ్వంత్ జోతిరావు పూలే 1891లో పూనాలోని 'సుభోధ్ ప్రకాశ్ ప్రెస్' ద్వారా ప్రచురించి విడుదల చేయించారు. అప్పుడు ఆ స్తుతిగీతం పుస్తకం వెల 12 అణాలుగా నిర్ణయించారు. ఆ తరువాతి కాలంలో Prof. Hari Narke (University of Pune, Maharashtra) సంపాదకత్వంలో మహారాష్ట్ర ప్రభుత్వం తన సాహిత్య సాంస్కృతిక విభాగం ద్వారా MAHATMA PHULE SAMAGRA VANGMAY పేరిట వెలువరించిన సంపుటాల లోని పుట 608, 609లో ఈ పవాడ (స్తుతిగీతం) చోటుచేసుకుంది.

మహాత్మా జోతీరావు పూలే విరచిత 'మానవ్ ముహమ్మద్' పవాడా చాలా సుదీర్ఘమైంది. ఆ పవాడలో ఇస్లాం, ప్రవక్త ముహమ్మద్ (స), ముస్లింల గురించి, అనాటి సామాజిక స్థితిగతులు, అతిశూద్ర, శూద్ర కులాల వెతలు, అధిపత్యకులాల చేష్టలను పేర్కొంటూ చాలా ఘాటుగా విమర్శించారు. ఆ విమర్శనాత్మక భాగాలను తీసుకోకుండా ఇస్లాం, ప్రవక్త ముహమ్మద్ (స), ముస్లింల వరకు చేసిన ప్రస్తావనల వరకు మాత్రమే పరిమితమయ్యి పవాడను మహారాష్ట్రలోని షోలాపూర్ పట్టణానికి చెందిన ప్రముఖ ఉర్దూ కవి ప్రొఫెసర్ డాక్టర్ ఇబ్రహీం ఫైజ్ ఉర్దూ హిందిలోకి అనువదించారు. ఆ ఉర్దూ అనువాదం 'నుఖూషె జావిదా' పుస్తకంలో చోటుచేసుకుంది. ఆ 'పవాడా'ఉర్దూ అనువాదాన్ని

Mr Anjum Zakaria Inamdar (Pune, Maharashtra) తన శ్రావ్యమైన కంఠంతో గానం చేసి వీడియోను Youtube లో పోస్టు చేశారు. ఆయన గానం చేసిన 'పవాడా'ను https://youtu.be/BZClaXhTs8c ద్వారా వినవచ్చు.

ఆ విధంగా పూలేగారి 'పవాడా' పలు భాషల్లోకి అనుదించబడింది. ఆ పవాడాను ప్రముఖ రచయిత, బహుభాషా పండితులు అబుల్ ఫౌజాన్ (కరీంనగర్, తెలంగాణ) తెలుగులోకి 2017లో అనువదించారు. ఆ అనువాదాన్ని నేను, అబుల్ ఫౌజాన్ కలసి చర్చించి, పునఃసమీక్షించి 2020 డిసెంబర్‌లో తుదిరూపమిచ్చాం.ఆ 'పవాడ' తెలుగు అనువాదం తోపాటుగా ఉర్దూ-హిందీ అనువాదాలను కూడా ఇక్కడ పొందు పర్చాను.

మహాత్మా జోతిరావు పూలే చిన్నతనం నుండి ముస్లిం జనసముదాయాలతో కలసి మెలసి తిరిగారు. ఆయన తండ్రి గోవిందరావు చిన్నారి పూలేను బడిలో చేర్చినప్పుడు ఆయనకు ముస్లిం మిత్రులు చాలామంది జోడయ్యారు. ఆ తరువాత స్కాటిష్ మిషనరీ స్కూల్‌లో చేరిన జోతీరావు పూలే అక్కడ మాత్రమే కాకుండా పూనాలోని బుధవార్ పేట్ ప్రాంతంలో గల ప్రభుత్వ పాఠశాలలో కూడా విద్యాభ్యాసం చేసారు. ఆ సందర్భంగా ఆయనకు పలువురు ఇతర కులాల, మతాల విద్యార్థులతో పాటుగా ముస్లిం విద్యార్థులతో సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. ఆ మిత్రులతో ఇస్లాం-హిందూ మతం మంచి చెడుల తులనాత్మక చర్చలు సాగించారు. (Jotirao Phule, Tarkateertha Lakxmanshastri Joshi, National Book Trust , India, New Delhi, 1992, Page No. 7).

మహాత్మా జోతీరావు పూలే తండ్రి గోవిందరావు పూలే గంజ్‌పేట నివాసం చుట్టూతా ముస్లింల నివాసాలు ఉండటంతో తన ముస్లిం మిత్రులతో కలసి ఆయన తరచుగా ముస్లింల ఇళ్లలోకి స్వేచ్ఛగా వెళ్ళగలిగేవాడు. వారి కుండల్లో నుండి స్వతంత్రంగా, సొంతంగా నీరు తీసుకుని తాగేవారు. ఏ ముస్లిం ఇంట్లోకైనా ఆయన ప్రవేశించగలిగేవాడు. ఎవరూ ఎలాంటి అభ్యంతరాలు తెలిపేవారు కారు. (Mahatma Jyothiba Phule (Hayat Aur Karname), Syed Shah Ghaziuddin, Idara Barae Mutalea Wa Tahqiq Tareekhe Deccan, Solapur, 2010, Page No.34)

ఆ వాతావరణంలో మసలిన మహాత్మా పూలే విద్యాభ్యాసం తరువాత తన మిత్రులతో కలసి మాతృభూమి విముక్తికి స్వాతంత్ర్య సమరం సాగించాలనుకున్నారు.ఆ దిశగా ప్రయత్నాలు కూడా ఆరంభించారు. ఆ సమయంలో అతని మిత్రుని వివాహానికి అతిధిగా వెళ్ళిన సందర్భంగా ఆయన వివాహ ఊరేగింపులో పాల్గొన్నారు. అందుకు

**మహాత్మా ఫూలే విరచిత పవాడా 'మానవ్ ముహమ్మద్' ఉర్దూ అనువాదాన్ని తెలంగాణా రాష్ట్రం కరీంనగర్ కు చెందిన ప్రముఖ రచయిత అబుల్ ఫౌజాన్ చేసిన తెలుగు అనువాదమిది.**

**ము**హమ్మద్(స) ప్రపంచానికి విచ్చేసినారు – చీకట్లను వెలుగుల్లోకి మార్చేసినారు.
పరమాత్మతో సంబంధాన్ని దృఢపర్చినారు – విగ్రహారాధన పట్ల విముఖత కలిగించినారు.
పరమాత్మ సత్యం, ఆయన్నే ఆరాధించమన్నారు – అసత్యం నుండి దూరంగా ఉండమన్నారు.
ఊహాజనిత విగ్రహాల ఊసే వద్దన్నారు – మేలు మంచితనాల దిశగా ఊహలు మళ్ళించమన్నారు.
ముహమ్మద్ (స) ధర్మ–విశ్వాసాలతో ముందుకు సాగారు – సౌభ్రాతృత్వ సందేశమిచ్చే ఖురాన్‌తో కదిలారు.
సృష్టికర్త మీకొక్కడే అని నొక్కి వక్కాణించారు – సృష్టికంతటికి ఆయనే ఆధారభూతమన్నారు.
భూమ్యాకాశాలు, సూర్యచంద్ర నక్షత్రాలు – ఆయన అజ్ఞానుసారమే చరిస్తున్నాయన్నారు.
ఆ సృష్టికర్త సృష్టితాలమే మనమంతా–ఆయనే సర్వులకు ప్రభువు, అందరికి యజమాని అన్నారు.
ఆయనొక్కడే తప్ప మరెవ్వరూ ఆరాధ్యులు కారు – ఆయన తప్ప ఇంకెవరూ ఆరాధనకు అర్హులు కారు.
ఆ సందేశమే తీసుకుని మీ వద్దకు వచ్చాను – మీకోసం శ్రేయో సాఫల్యాల కానుక తెచ్చాను.
ముహమ్మద్ (స) వాస్తవికతకు నిలువెత్తు రూపం – ముహమ్మద్ (స) యదార్థానికి తిరుగులేని సాక్ష్యం.
అల్లాహ్ మహోన్నతుడని ముహమ్మద్ (స) పలికారు – ఇంటింటా ఇస్లాంను ముహమ్మద్ (స) చేరవేశారు.
ముహమ్మద్ (స) గడిపారు అతి సామాన్య జీవితం – ఆ మహనీయుని కోసం అర్పింతును గాక నా ప్రాణం.
ముహమ్మద్ (స) గుండెనిండా దైవభావనే ఉండేది–ముహమ్మద్ (స)మనస్సునిండా దైవ సౌందర్యమే ఉండేది.
స్వపరాలభేదాల్ని ముహమ్మద్(స) రూపుమాపారు–సర్వజనులను హృదయానికి ముహమ్మద్(స) హత్తుకున్నారు.
అజ్ఞానం, అధోపతనాల నుండి విముక్తం చేశారు – మనిషిని మనీషిగా మార్చారు ముహమ్మద్ (స)
ముహమ్మద్ (స) మానవత్వం మహిమను చూపింది – నలుదిక్కులా ఈ నినాదం పిక్కటిల్లింది.
సృష్టికర్త ఒక్కడే, సృష్టి అంతా ఆయనదే – విశ్వజనులంతా ఒకరికొకరు సహోదరులే.
వినలేదు మక్కావాసులు ఆయన మాట వినలేదు–విచ్చలవిడిగా ముహమ్మద్(స) పై దౌర్జన్యాలు సాగించారు.
శతృవుల శతృత్వం తీవ్రతరమైనప్పుడు – అల్లాహ్ ఆదేశం మీద వలస వెళ్ళారు ముహమ్మద్(స).
శత్రువుల దుష్కృత్యాల నుండి ముహమ్మద్(స) విముక్తమయ్యారు– మదీనాను ముహమ్మద్ (స) ఆవాసం చేసుకున్నారు.
మదీనాలో సత్యసందేశం వికసించింది, ఫలించింది – మదీనా నుండి వెలుగు భువి అంతా వ్యాపించింది.
భారతావనికి మొగలులు పాలకులుగా వచ్చారు – ముహమ్మద్(స) ఏకేశ్వర సందేశాన్ని తీసుకొచ్చారు.
ఆర్యులిక్కడ ఎంతోకాలంగా ఆధిపత్యంలో ఉన్నారు–శూద్రులు పశువుల కన్నా హీనమని వారు భావించారు.
శూద్రుల్ని ముస్లింలు తమవారుగా చేసుకున్నారు – గౌరవించి శూద్రుల్ని తమ గుండెలకు హత్తుకున్నారు.
శౌర్యానికి క్షత్రియులు ఇక్కడ ప్రతిరూపాలు – ముస్లింలకు వారంతా మిత్రులై మెలిగారు.
హోలి, దీవాలీల్ని వారెలా జరుపుకున్నారో – పీర్ల పండగని కూడా తమదిగా చేసుకున్నారు.
మనస్సులను కలిపేది నిజమైన ధర్మం – ద్వేషాలను మాపేదే సత్యమైన ధర్మం.
మతం,మత విశ్వాసాలను అడ్డు పెట్టుకుని – ప్రజలలో కలహాలు సృష్టించి తరచూ ఘర్షణలకు గురిచేస్తారు.
స్వజనులు కూడా వారి దృష్టిలో పరాయివారే – ఏ ఫలితాన్నిస్తుందో వారి ఈ వైఖరి చూడాల్సిందే.
చెవులు రిక్కరించి 'జోతి' చెప్పేది వినండోయ్ – ఇలాంటి వారితో జాగ్రత్తగా ఉండటమే మేలండోయ్.

మహాత్మా జోతిరావు పూలే మరాఠిలో రాసిన 'పవాడా'ను మహారాష్ట్ర, షోలాపూర్ చెందిన ప్రముఖ ఉర్దూ కవి ప్రొఫెసర్ డాక్టర్ ఇబ్రహీం ఫైజ్  చేసిన ఉర్దూ అనువాదమిది.

محمد ﷺ جو دنیا میں تشریف لائے
خدا سے تعلق کچھ اس طرح جوڑا
کہا جھوٹ سے اپنا دامن بچالو
خیالی بتوں کے خیالوں کو چھوڑو
محمد ﷺ بڑھے دین و ایمان لے کر
کہا ایک ہے ایک خالق تمہارا
زمیں آسمان چاند سورج ستارے
اسی ایک خالق کی مخلوق ہم سب
سوا اس کے معبود کوئی نہیں ہے
اسی کا میں آیا ہوں پیغام لے کر
محمد ﷺ حقیقت کے پیکر محمد ﷺ
محمد ﷺ نے فرمایا اللہ اکبر
محمد ﷺ سدا گامزان سادگی پر
محمد ﷺ کے دل میں خیال خدا تھا
محمد ﷺ نے نقش دوئی کو مٹایا
جہالت سے پستی سے اوپر اٹھایا
محمد ﷺ کی انسانیت رنگ لائی
خدا ایک ہے اس کی ساری خدائی
نہ مانے مگر اہل مکہ نہ مانے
جو بڑھتی گئی دشمنوں کی عداوت
مدینے میں حق کا ہوا بول بالا
مغل ہند میں حکمراں بن کے آئے
نجی دشمنوں سے یوں پیچھا چھڑایا
یہاں آریہ با اثر تھے سراسر
مسلماں نے شدروں کو اپنا بنایا
جوکھتری یہاں تھے شجاعت کے پیکر
وہ جس طرح ہولی دیوالی مناتے
جو رشتوں کو جوڑے وہی دھرم سچا
جو دھرم اور وشواس کی آڑ لے کر
ہے اپنے بھی ان کی نظر میں پرائے
سنو کھول کر کان جوتی کا کہنا

اجالوں میں بدلے اندھیروں کے سایہ
بتوں کی پرستش سے منہ اپنا موڑا
خدا سچ ہے بس اس کو اپنا بنالو
بھلائی کی جانب ارادوں کو موڑا
پیام اخوت و قرآن لے کر
اسی کی بدولت یہ عالم ہے سارا
اسی کے اشارے پہ چلتے ہیں سارے
وہی سب کا مالک وہی سب کا ہے رب
سوا اس کے مسجود کوئی نہیں ہے
تمہاری بھلائی کا انعام لے کر
محمد ﷺ صداقت کے پیکر محمد ﷺ
محمد ﷺ پہنچایا اسلام گھر گھر
تصدق ہے جاں آپ ﷺ کی زندگی پر
محمد ﷺ کے دل میں جمال خدا تھا
محمد ﷺ نے سب کو گلے سے لگایا
محمد ﷺ نے انساں کو انساں بنایا
تو ہر سمت سے پھر یہ آواز آئی
کہ دنیا کے انساں ہیں بھائی بھائی
محمد ﷺ پر کھل کر لگے ظلم ڈھانے
بحکم خدا کی محمد ﷺ نے ہجرت
مدینے سے دنیا میں پھیلا اجالا
محمد ﷺ کا پیغام وحدت بھی لائے
محمد ﷺ نے چل کر مدینہ بسایا
سمجھتے تھے شدروں کو حیوان سے بدتر
انہیں دے کر عزت گلے سے لگایا
رہے اہل ایماں کے وہ دوست بن کر
اسی طرح سے تعزیے بھی بٹھاتے
جو نفرت کو چھوڑے وہی دھرم اچھا
لڑاتے ہیں لوگوں کو آپس میں اکثر
یہ ان کی ادا جانے کیا رنگ لائی
کہ بہتر ہے ایسوں سے ہشیار رہنا

**మహాత్మా జోతిరావు పూలే మరాఠిలో రాసిన 'పవాడా'ను మహారాష్ట్ర, షోలాపూర్ చెందిన ప్రముఖ కవి ప్రొఫెసర్ డాక్టర్ ఇబ్రహీం ఫైజ్ చేసిన హింది అనువాదమిది.**

| | |
|---|---|
| मोहम्मद जो दुनिया मे तशरीफ लाये | उजालों मे बदले अंधरों के साये |
| खुदासे त-अलुक कुछ इस तरह जोडा | बुतों कि परस्तिश से मुँह अपना मोडा |
| कहा झुठ से अपना दामन बचालो | खुदा सच है बस इसको अपना बना लो |
| खयाली बुतों को खयालो को छोडो | भलाई कि जानिब इरादों को मोडो |
| मोहम्मद बडे दिनो ईमान लेकर | पयाम अखुत व कुरआन ले कर |
| कहा एक है एक खालिक तुम्हारा | उसी की बदौलत है ये आलम सारा |
| जमीन आस्मान चाँद सूरज सितारे | उसीके इशारों पे चलते है सारे |
| उसी एक खालीक की मखलूक हम सब | वही सबका मालिक वही सब का है रब |
| सिवाए उसके माबूद कोई नही है | सिवाए उसके मस्जुद कोई नही है |
| उसीका मै आया हूँ पैगाम लेकर | तुम्हारी भलाई का इनाम लेकर |
| मोहम्मद हकीकत के पै कर मोहम्मद | मोहम्मद सदाकत के पै कर मोहम्मद |
| मोहम्मद ने फरमाया अल्लाहू अकबर | मोहम्मद ने पहुंचाया ईस्लाम घर घर |
| मोहम्मद सदा गामजन सादगी पर | तसद्दुक है जान आपकी जिंदगी पर |
| मोहम्मद के दिल में खयाले खुदा था | मोहम्मद के दिल मे जमाले खुदा था |
| मोहम्मद ने नक्शे दवई को मिटाया | मोहम्मद ने सबको गले से लगाया |
| जहालत से पस्ती से उपर उठाया | मोहम्मद ने इंसा को इंसा बनाया |
| मोहम्मद की ईंसानियत रंग लायी | तो हर सिम्त से फिर यह आवाज आयी |
| खुदा एक है उसकी सारी खुदाई | के दुनिया ईंसान है भाई भाई |
| न माने मगर अहले मक्का न माने | मोहम्मद पे खुलकर लगे जुल्म ढाने |
| जो बढती गयी दुश्मनों की अदावत | बहुक्म खुदा कि मोहम्मद ने की हिजरत |
| मदिने मे हक का हुआ बोलबाला | मदिने से दुनियाँ मे फैला ऊजाला |
| मुगल हिंद मे हुकमरा बनके आये | मोहम्मद का पैगाम वहिदत भी लाये |
| निजी दुश्मनों से यु पिछा छुडाया | मोहम्मद ने चलकर मदिना बसाया |
| यहाँ आर्या बा असर थे सरासर | समजते थे शुद्र को हैवान से बदतर |
| मुसलमानों ने शुद्रों को अपना बनाया | उन्हें देकर इज्जत गले से लगाया |
| जो खत्री यहाँ सुजाअत के पैकर | रहे अहलो ईमान के वो दोस्त बनकर |
| वो जिस तरह होली दिवाली मनाते | उसी तरहसे वो ताजिये भी बिठाते |
| दिलो को जो जोडे वही धर्म सच्चा | जो नफरत को छोडे वही धर्म सच्चा |
| जो धर्म और विश्वास की आड लेकर | लडाते है लोगों को आपस में अक्सर |
| है अपने भी इनकी नजर में पराये | ये इनकी अदा जाने क्या रंग लाये |
| सुनो खोलकर कान ज्योती का कहना | के बेहतर ऐसो से होशियार रहना |

ఆగ్రహించిన ఆధిపత్యకులానికి చెందినవారు దుర్భాషలాడి అమర్యాదకరంగా ఆయనను వివాహ ఊరేగింపు నుండి నిష్క్రమింపజేసారు. ఆ విషయాన్ని ఎంతో బాధతో తన తండ్రి గోవిందరావు దృష్టికి తీసుకురాగా, అదంతా అత్యంత సహజమైన విషయంగా ఆయన చెబుతూ ఆధిపత్య కులాలు నిర్దేశించిన ఆంక్షలు, ఆక్షేపణలు, కట్టుబాట్లు నిమ్న కులాల వాళ్లకు శిరోధార్యమని నచ్చ జెప్పటం ఆరంభిచారు. ఆ పరిస్థితులను చూసాక రాజకీయ బానిసత్వం కంటె సామాజిక బానిసత్వం నుండి స్వేచ్ఛ కోసం పాటుపడాలని జోతిరావు పూలే భావించారు. అది చదువు ద్వారా మాత్రమే సాధ్యమన్న నిర్ణయానికి వచ్చిన జోతిరావు పూలే సామాజిక ఉద్యమాల దిశగా తన ప్రయాణం ఆరంభించారు.

మహాత్మా జోతిరావు పూలే, సావిత్రీబాయి పూలేలు నూతన మార్గాన్ని నిర్దేశించుకుని ప్రయాణం ఆరంభించాక వారి వ్యక్తిగత ఉద్యమ జీవితాల ఆరంభ దశలో మున్షీ గఫ్ఫార్ బేగ్, ఉస్మాన్ షేక్, ఫాతిమా షేక్‌లు ప్రభావితం చేసారు. చిన్నారి జోతిరావు చదువును ఆయన తండ్రి మాన్పించినప్పుడు ఆయన పాఠశాలలో పునఃప్రవేశానికి తోడ్పాటు ఇచ్చింది మున్షీ గఫ్ఫార్ బేగ్. జోతిరావు అతిశూద్ర, శూద్ర కులాల బాలికలకు పాఠశాల ఏర్పాటు చేశాక ఇది ఇష్టంలేని తండ్రి గోవిందరావు ఆగ్రహించి పూలే దంపతులను తన ఇంటి నుండి వెళ్ళగొట్టినప్పుడు ఆ ఇరువుని ఆదుకుని ఆశ్రయం కల్పించిన వ్యక్తి ఉస్మాన్ షేక్. విద్యను సార్వజనీనం చేయడానికి, బాలికలకు విద్య గరపడానికి పూలే దంపతులు చేస్తున్న కృషిని గమనించి వారి తోడ్పాటుకు ముందుకు వచ్చారు ఫాతిమా షేక్. ఆ సంఘటనలు, తను అనుభవించిన సామాజిక వాతావరణం కారణంగా జోతీరావు పూలేలో ఇస్లాం, ప్రవక్త ముహమ్మద్ (స), ముస్లింల పట్ల సానుకూల భావజాలం స్థిరపడింది.

ఆ భావజాలం ప్రభావంతో ఆయన 'మానవ్ ముహమ్మద్' శీర్షికతో పవాడా రాశారు. ఆ 'పవాడా'లో ఇస్లాం, ప్రవక్త ముహమ్మద్ (స), ముస్లింలను శ్లాఘించడం మాత్రమే కాకుండా ఆయన తన గ్రంథాలలో కూడా ఘనంగా ప్రస్తుతించారు. ప్రధానంగా 'సత్‌సార్-1' లో ఒక బ్రహ్మణుడితో సాగిన కాల్పనిక సంవాదంలో శూద్రుని చేత 'మా ధర్మం కేవలం మీకు సేవ చేయడమేనా? మేము మా సౌకర్యం కోసం మేము కోరుకున్నప్పుడు ముహమ్మదీయ లేక క్రైస్తవ ధర్మాన్ని అవలంభిస్తాం' అని హెచ్చరికలు చేయిస్తాడు. (Mahatma Jyothiba Phule (Hayat Aur Karname), Syed Shah Ghaziuddin, Idara Barae Mutalea Wa Tahqiq Tareekhe Deccan, Solapur,

2010, Page No.79). 'సర్వజనిక్ సత్యధర్మ్'లో 'బానిసలుగా చేయబడిన శూద్రవర్గాల్ని ఆ చెర విడిపించి...ఒకే కంచంలో తింటూ వైవాహిక సంబంధాలు ఏర్పర్చుకుని సర్వ హక్కులు ఇచ్చారు' అంటాడు (Mahatma Jyothiba Phule (Hayat Aur Karname), Syed Shah Ghaziuddin,Page No. 79).'కాష్త్‌కార్.కా.తాజియానా' 'సర్వజనిక్ సత్యధర్మ్ పుస్తక్', 'గులామి' తదితర గ్రంథాలలో ఇస్లాం, ప్రవక్త ముహమ్మద్ (స), ముస్లింలకు సంబంధించిన ధార్మిక, సామాజిక విషయాలను చర్చిస్తూ శ్లాఘించడం మాత్రమే కాకుండా సామాజిక అంశాలలో సానుకూలత వ్యక్తంచేశారు.

మహాత్మా జోతిరావు పూలే ఇస్లాం, ప్రవక్త ముహమ్మద్ (స), ముస్లింలను శ్లాఘించడం వరకు సరిపెట్టుకోలేదు. ముస్లిం పాలకులు, ముస్లిం ప్రజానీకం, ముస్లిం ధార్మికవేత్తల తీరుతెన్నుల మీద కూడా విరుచుకు పడ్డారు. 'పూలే ఎక్కడయితే ఇస్లాంను స్వాగతించారో, ముస్లింలను పొగిడారో దానితోపాటే వారి లోపాల్ని, వారి చారిత్రిక తప్పిదాలను కూడా ఎత్తిచూపుతూ ఇస్లాం మతం బోధించిన సామాజిక సమానత్వం, బాధిత ప్రజల పక్షం లాంటి సందేశాలను మరచిపోయారని విమర్శించారు' (Mahatma Jyothiba Phule (Hayat Aur Karname), Syed Shah Ghaziuddin, Page No. 80).

ఇస్లాం బోధించిన సాంఘిక సమానత్వం, భాధితుల పక్షాన పోరాటాన్ని మరిచి ఇండియాలోని ముస్లిం పాలకులు విలాసాల్లో మునిగిపోయారని దుయ్యబట్టారు. 'సర్వజనిక్ సత్యధర్మ్ పుస్తక్'లో 'ముస్లింలు తమ లక్ష్యాన్ని మరచి పోయారు. నృత్యగానాల్లో తల మునకలైపోయారు.సుఖభోగలాలసులయ్యారు.ఆ కారణంగా సృష్టికర్తకు ఆగ్రహం కలిగింది ...అసంతుష్టుడయిన పరమాత్మ వారి అధికారాన్ని, వారి దర్పాన్ని సమాప్తం చేశాడు. ముస్లింల (పాలకుల) స్థానంలో ఆంగ్లేయులను కూర్చోబెట్టాడు', (Mahatma Jyothiba Phule (Hayat Aur Karname), Syed Shah Ghaziuddin, Page No. 81), అంటూ ఆనాటి ముస్లిం పాలకుల తీరుతెన్నుల మీద ఆగ్రహం వ్యక్తం చేసారు.

ఈ మేరకు మహాత్మా జోతిరావు పూలే ప్రశంసలు, విమర్శలు ఎలా ఉన్నా 'మానవ్ ముహమ్మద్' శీర్షికతో ఇస్లాం, ప్రవక్త ముహమ్మద్ (స), ముస్లింలను శ్లాఘిస్తూ రాసిన 'పవాడా' (స్తుతిగీతం) మాత్రం ఆయన సాహిత్య వాఙ్మయ చరిత్రలో విశేషమైన అంశంగా నిలిచిపోయింది. ◆

# ఆధార గ్రంథాలు




## తెలుగు పుస్తకాలు :

01. ముస్లింలు-అంబేద్కర్ (అపోహలు-వాస్తవాలు), మూలంః డా॥ ఆనంద్ తేల్‌తుంబ్డే, అనువాదంః చంద్రిక, కులనిర్మూలన ప్రచురణలు, హైదరాబాద్, 2003.
02. సామాజిక విప్లవకారిణి సావిత్రీబాయి, వ్యాససంపుటి, మూలం : బ్రజ్ రంజన్ మణి, సింధియా స్టీఫెన్, గేల్ అంవెట్, ప్యామెల సర్దార్, తెలుగు అనువాదంః కాత్యాయని, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 2017.
03. గులాంగిరి, జోతీరావు పూలే, అనువాదం : ఏలూరి రామయ్య, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, హైదరాబాద్, 2018.
04. మహాత్మా జ్యోతిరావ్ పూలే సంక్షిప్త రచనలు, తెలుగు అనువాదం : హారతి వాగీశన్, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, హైదరాబాద్, 2018.
05. మహాత్మా జోతిరావ్ ఫులే, ధనంజయ్ కీర్, తెలుగు అనువాదం : డాక్టర్ బి.విజయ భారతి, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, హైదరాబాద్, 2018.
06. ఆధునిక భారత తొలి మహిళా టీచర్ సావిత్రీబాయి పూలే, బి.యం.లీలావతి/దుర్గం సుబ్బారావు, సత్యశోధక్ వాయిస్, కర్నూలు, 2020.
07. సోషల్ సైంటిస్ట్ సావిత్రిబాయి,సంగిశెట్టి శ్రీనివాస్, ఫోరం ఫర్ కన్సర్న్డ్ బీసీస్,హైదరాబాద్,2020.

## తెలుగు వ్యాసాలు :

01. ఆధునిక భారత చరిత్రలో ధృవతార సావిత్రీబాయి పూలే, కె. విజయగౌరి, సాక్షి దినపత్రిక, 03-01-2015.
02. మానవ హక్కుల వైతాళికురాలు సావిత్రీబాయి పూలే, గుడూరు సీతామహాలక్ష్మి, ఆంధ్రజ్యోతి దినపత్రిక, 02-01-2016.

## ఆంగ్ల పుస్తకాలు :

01. Jotirao Phule, Tarkateertha Laxmanshastri Joshi, National Book Trust, India,New Delhi, 1992.
02. Women Pioneer In India's Renaissance, Edited by Sushila Nayar and Kamla Mankekkar, National Book Trust, India, New Delhi, 2005.
03. Women Writing in India 600 B.C. to the Early Twentieth Century Vol ume-I, Edited by Susie Tharu and K. Lalita, The Feminist press, Newyork, 1999.

04. Understanding Caste: From Buddha to Ambedkar and Beyond Omvedt, Gail, Orient Blackswan. New Delhi, 2011.

## ఆంగ్ల వ్యాసాలు ః

01. Why Indian History has forgotten Fatima Sheikh but remebers Savitribai Phule, Mr Dilip Mandal, 9 Jan, 2019.
02. Fatima Sheikh : The women who reshaped Indian education with Savitribai Phule, Mrs Vandana Menon, 9 Jan, 2018.
03. Fatima Sheik & Savitribai established the school for Girls in 1848.
04. Rememebering Fatima Sheik - A women lost in History/Indian Women in History, Mr Aga Khan, 22, Jan, 2017.
05. How India's Muslim Woman Teacher started 'Beti Padavo' Move https://prabohnteem.blogspot.com/2013/10/blog-post_25.htmlment in 19th Century, Mr Rinchen Norbu wngchuk, 19, Sepetember, 2018.
06. Remembering Fatima Sheikh, the first Muslim teacher who laid the foundation of Dalit-Muslim unity, Siddhant Mohan14 April 2017

## ఉర్దూ పుస్తకాలు ః

01. క్రాంతిజ్యోతి సావిత్రిబాయి పూలే, డాక్టర్ తాహెరా షేక్, ఆదిల్ పబ్లికేషన్స్, పూనా, 2000.
02. మహాత్మా జ్యోతిరావు పూలే (హయాత్ ఔర్ కార్నామే), సయ్యద్ షాహ్ గాజియుద్దీన్ (అడ్వకేట్), ఈదార బారయే ముతాలియా వా తహ్ఖీక్ తారీఖే దక్కన్, షోలాపూర్, 2010.
03. మహాత్మా జోతి రావ్ పూలే, (నజరియాత్ ఔర్ అదబ్), డాక్టర్ నశ్రీన్ రంజాన్ సయ్యద్, రహమాని పబ్లికేషన్స్, మాలేగావ్, 2015.
04. షాయరా సావిత్రి బాయి పూలే, డాక్టర్ నశ్రీన్ రంజాన్ సయ్యద్, రహమాని పబ్లికేషన్స్, మాలేగావ్, 2015
05. ఫాతిమా షేక్ ఔర్ చాంద్‌బీబి, డాక్టర్ నశ్రీన్ రంజాన్ సయ్యద్, జయిద్ పబ్లికేషన్స్ హౌస్, పూనా, 2018.
06. ఉర్దూ పాఠ్యపుస్తకం, రెండవ తరగతి, బాలబారతి, మహారాష్ట్ర రాష్ట్రప్రభుత్వం ప్రచురణ, పూనా, 2013.

## మరాఠి పుస్తకాలు ః

01. భారతాతీల్ పహీలీ ముసల్మాన్ శిక్షక్ః ఫాతిమా షేక్, దినకర్ విష్ణ కాకడే, సంఘమిత్ర పబ్లికేషన్స్, మీరజ్, 2019.
02. మహాత్మా పూలే గౌరవ గ్రంథ్, సంపాదకులు ః హరి నరకె - వై.డి.ఫథకే, మహారాష్ట్ర రాజ్య శిక్షణా విభాగ్ మంత్రాలయ, బొంబాయి, 1991.

## మరాఠి పత్రికలు ః

01. ముస్లిం సత్యశోధక్, త్రైమాస పత్రిక, ముస్లిం సత్యశోధక మండల్, పూనా, జూలై-ఆగస్టు 2020.

02. మహారాష్ట్ర రాజ్య ఆరోగ్య పత్రిక, మాసపత్రిక, మహారాష్ట్ర ప్రభుత్వప్రచురణ, మార్చి, 2020.

**హిందీ పుస్తకాలు :**

01. సంత్, మహాత్మా, విచారక్ ఔర్ ఇస్లాం, సంకలక్ : సోమనాథ్ దేశ్‌కర్, సందేశ్ ప్రకాషన్, పూనా, 2014.

# Websites :

01) https://en.wikipedia.org/wiki/Fatima_Sheikh
02) https://www.mpositive.in/tag/fatima-sheikh/
03) https://theprint.in/report/fatima-sheikh-reshaped-indian-education-savitribaiphule/27603/
04) https://www.cosmopolitan.in/life/features/a18062/remembering-fatima- sheikh-forgotten-feminist-and-first-muslim-woman-teacher
05) https://www.thebetterindia.com/159719/fatima-sheikh-beti-padhao-phule-education/
06) https://www.sabrangindia.in/article/remembering-fatima-sheikh-first-muslim-teacher-who-laid-foundation-dalit-muslim-unity
07) https://www.bbc.com/hindi/india-54069860
08) https://feminisminindia.com/2017/06/22/fatima-sheikh-essay/
09) https://www.shethepeople.tv/sepia-stories/fatima-sheikh-muslim-femi nist-forgotten-history/
10) https://velivada.com/2020/01/09/remembering-fatima-sheikh/
11) https://sabrangindia.in/article/remembering-fatima-sheikh-first-muslim-teacher-who-laid-foundation-dalit-muslim-unity
12) https://prabodhnteem.blogspot.com/2013/10/blog-post_25.html
13) https://www.livemint.com/Leisure/DmR1fQSnVD62p4D3eyq9mO/The-life-and-times-of-Savitribai-Phule.html
14) https://velivada.com/2020/01/09/remembering-fatima-sheikh/
15) https://www.mynation.com/video/lifestyle/here-are-lesser-known-facts-about-fatima-sheik-first-muslim-woman-teacher-of-india-px23gb
16) https://www.facebook.com/CUG382030/
17) https://www.shethepeople.tv/top-stories/opinion/womens-education-india-pioneers-savitribai-phule-fatima-sheikh-anutai-wagh/
18) http://www.anindianmuslim.com/2016/09/great-women-reformers-of-india-savitri.html
19) https://prabodhnteem.blogspot.com/2013/10/blog-post_25.html (Hindi)
20) https://www.bbc.com/hindi/social-38494018 (Hindi)

## Youtube Channels :

01) https://www.youtube.com/watch?v=Dwp_ZDds3yQ (Hindi)
02) https://www.youtube.com/watch?v=wODTV-JJ18U(Kannada)
03) https://www.youtube.com/watch?v=F9G7XtgsoYw (English)
04) https://www.youtube.com/watch?v=6yLG7_pTLgE (Hindi)
05) https://www.youtube.com/watch?v=18cluYnYv0M (Hindi)
06) https://www.youtube.com/watch?v=pn31fbtJ2lM (Hindi)
07) https://www.youtube.com/watch?v=UsMlRpmRebI (Hindi)
08) https://www.youtube.com/watch?v=kssMkTO2nTE (English)
09) https://hindi.mynation.com/video/news/unsung-story-of-fatima-sheikh-who-fought-for-women-education-pxb84f (Hindi)
10) https://www.youtube.com/watch?v=w7-obnliyX8 (Telugu)
11) https://www.youtube.com/watch?v=y2CKJMepdzQ (Telugu)
12) https://www.youtube.com/watch?v=3f1KQGX0vy4 (Hindi)
13) https://www.youtube.com/watch?v=etAgHagOWgY (Hindi)
14) https://www.youtube.comwatch?v=etAgHagOWgY&list =RDCMUCX0O0s TaSb3l94 HxqF -pcog&start_ radio=1#t=38 (Hindi)
15) https://www.youtube.com/watch?v=Dwp_ZDds3yQhttps:// www.youtube.com/watch?v=Dwp_ZDds3yQ (Hindi)
16) https://www.youtube.com/watch?v=XUXxHfFKqwc (Hindi)
17) https://www.youtube.com/watch?v=18cluYnYv0M (Hindi)
18) https://www.youtube.com/watch?v=Ck75j14DkPE (Hindi)
19) https://www.youtube.com/watch?v=JfOBtpGd4ec&feature=youtu.be (In Marati language with English version)
20) https://youtu.be/BZClaXhTs8c (Urdu)

I am sincerely acknowledge that some of the pictures found in the pages 30, 36, 40, 46 of this book were taken from

**BBC News Portal (Hindi).**

# THANK YOU

My heartfelt thanks to the following personalities who helped me in different ways during the preparation of **FIRST MUSLIM LADY TEACHER OF MODERN INDIA : FATHIMA SHAIK**

Prof. Praveen Ghodeswar (Yashwantrao Chavan Maharashtra Open University, Nashik, Maharashtra), Prof. Umesh Bagade, Dr. Babasaheb Ambedkar Marathwada University, Maharashtra), Prof. Hari Narke (University of Pune, Maharashtra), Dr. M.G. Mali (Pune, Maharashtra), Mr. Somnath Ramachandra Deshkar (Journalist, Times of India, Pune, Maharashtra), Mr. Dinakar Vishnu Kakady (Pune, Maharashtra), Dr Sayyed Nasreen Ramzan (Pune, Maharashtra), Prof.Zaheer Ali (University of Mumbai, Mumbai, Maharastra), Dr. Tahera Shaik (Pune, Maharashtra), Mr. Sayyed Shah Wayez Ahmed (Adv. Ghaziuddin Research Centre, Solapur, Maharashtra), Mr. Shams Ur Rehman Alavi (Journalist, Nagapur, Maharashtra), Mr. Sarfraz Ahmed (Solapur, Maharashtra), Mr. Arif a Shaikh (Jalgaon, Maharashtra), Dr. Khazi Ragikoddin Riyajoddin (Jalgaon, Maharashtra), Mr Anjum Zakaria Inamdar (Pune, Maharashtra), Prof. Sandeep Yadav (Delhi University, Delhi),

Dr. Katti Padmarao (Ponnuru, AP), Mr.Bhuvanagiri Venkata Krishna Purnanandam (Guntur, AP), Dr. Guduru Seetha Mahalakshmi (Vishakapatnam,AP), Mr.Durgam Subba Rao (Vijayawada, AP), Dr. Swaroopa Rani Challapalli (Acharya Nagarjuna University, Guntur, AP), Mrs. Haleema Sadiya (Vijayawada, Krishna Dist., AP), Mr. Abdul Wahed (Geeturai, Hyderabad, Telangana), Mr. Shaik Karimullah (Poet, Vinukonda, AP), Dr Shajahana Begum Mohammad (Poetess, Hyderabad, Telangana), Mr. Yusuf Baba (Poet & Writer, Hyderabad, Telangana). Mr. Noorbasha Rahamthulla (Writer, Polakampadu, AP).

- SYED NASEER AHAMED

**I** am very much thankful to the friends who helped me a lot by translating into Telugu / Hindi / English several Urdu / Marati books and articles I had to consult for writing this book

**PROF. SHAMSHUDDIN TAMBOLI**

(President: Muslim Satyashodhak Mandal, Pune, Maharashtra)

**MR SALEEM IBRAHIM SHEIK**

(Sandesh Library, Pune, Maharashtra),

**DR. MOHD. SHAKIL TAJ MOHAMMAD JAFARI**

(Writer, Poet, Social Activist, Manchar, Pune Dist., Maharashtra).

**MR. ATAULLA KHA RAFIK KHA PATHAN**

(Writer, Social Activist, Tunki, Buldana Dist., Maharashtra),

**MR. ABUL FOUZAN**

(Writer, Karimnagar, Karimnagar Dist., Telangana),

**MR. JABIR MOHAMMAD**

(President: Islamic Research & Educational Society, Chandole, Guntur Dist., Andhrapradesh),

**MR. KOTHAPALLI SHAIK FARHATHULLAH**

(Hindi Pandit, Founder : Kamal Saheb Memorial Hindi Bhavan, Kadapa, Kadapa Dist., Andhrapradesh).

- SYED NASEER AHAMED

# సయ్యద్ నశీర్ అహమ్మద్



**స**య్యద్ నశీర్ అహమ్మద్ నెల్లూరు జిల్లా అల్లూరు తాలూకా పురిణి గ్రామంలో 1955 డిసెంబరు 22న జన్మించారు. (అధికారికంగా పుట్టిన తారీఖు 01-08-1954) తల్లిదండ్రులు : షేక్ బీబీజాన్, సయ్యద్ మీరా మొహిద్దీన్. వ్యవసాయ కుటుంబం. చదువు : ఎం.కామ్., ఎల్ఎల్.బి., సాహిత్యరత్న (హిందీ)., డి.జె. వృత్తి : న్యాయవాది. ప్రవృత్తి పాత్రికేయుడు-రచయిత. ప్రస్తుత నివాసం :ఉండవల్లి-522501, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. సంచారవాణిః +91 9440241727.

చిన్నతనం నుండి రాయడం ఆరంభించినా 1975లో 'మరోప్రపంచం' లిఖిత మాసపత్రికలో తొలిసారిగా కవితలు ప్రచురితం. 1976 నుండి 'ప్రగతి' సచిత్ర వారపత్రిక, జయశ్రీ, జ్యోతి మాసపత్రికల్లో పలు కథానికలు, కార్టూన్లు చోటు చేసుకున్నాయి. అప్పటి నుండి పలు పత్రికల్లో కవితలు, గేయాలు, కథలు, రాజకీయ -సామాజిక-సాహిత్య-చరిత్ర-సమీక్షా వ్యాసాలు, పలు వ్యంగ్య చిత్రాలు ప్రచురితం. మిత్రుడు వేదాంతం సీతారామా అవధానితో కలసి 'మరో ప్రపంచం', 'భేరి' లిఖిత మాస పత్రికలు వెలువరించారు. రాష్ట్రంలోని పలు సాంస్కృతిక-సాహిత్య-సేవా సంస్తలలో సభ్యునిగా పలు బాధ్యతలను నిర్వహించారు. పలు ప్రజా సంఘాలు, సంస్థలు నిర్వహించిన పత్రికలకు సంపాదకునిగా సేవలందించారు. స్వయంగా 2006 నుండి 2011 వరకు 'ఇండియా' మాసపత్రిక ప్రచురించారు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను వివరిస్తూ, 1998లో గ్రంథ రచన, ప్రచురణ ప్రారంభించారు. అప్పటి నుండి 1.) భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు, 2.) భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం మహిళలు, 3.) భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్రప్రదేశ్ ముస్లింలు, 4.) మైసూరు పులి : టిపూసుల్తాన్, 5). భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజా పోరాటాలు, 6.) షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్, 7.) భారత స్వాతంత్ర్య సంగ్రామం: ముస్లిం యోధులు-1, 8.) చిరస్మరణీయులు, 9.) 1857: ముస్లింలు, 10.) అక్షరశిల్పులు, 11.) చరితార్థులు (తెలుగు) / ది ఇమ్మోర్టల్స్ (ఆంగ్లం), 12.) కువైట్ కబుర్లు, 13 ) బిస్మిల్- అష్ఫాఖ్, 14. పండిత రాంప్రసాద్ బిస్మిల్- అష్ఫాఖుల్లా ఖాన్, 15.) కవిరాజు డాక్టర్ ఉమర్ అలీషా, 16.) అజాద్ హింద్ ఫౌజ్ ః ముస్లిం పోరాట యోధులు, 17.) గాంధీజీ ప్రాణరక్షకుడు ః బతఖ్ మియా అన్సారీ, 18.) మహాత్మాగాంధీ ః ముస్లిం సహచరులు -అనుచరులు, 19.) బహుముఖ ప్రజ్ఞాశాలి, భారత స్వాతంత్ర్యసమరయోధులు, భారతరత్న మౌలానా అబుల్ కలాం ఆజాద్ గ్రంథాలను వెలువరించారు. ఈ గ్రంథాలలో కొన్ని ఆంగ్లం, హిందీ, ఉర్దూ, తమిళ భాషల్లో అనువదించబడి ప్రచురితమయ్యాయి.

'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు' శీర్షికతో నశీర్ రాసిన సుదీర్ఘ ఆంగ్ల వ్యాసం అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం ప్రచురించిన 'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింల పాత్ర' వ్యాససంపుటిలో చోటుచేసుకుంది. ఈ వ్యాసాన్ని పలు రాష్ట్రాలలోని వివిధ సంస్థలు, సంఘాలు, పత్రికలు తమ ప్రత్యేక సావనీర్స్‌లో స్థానం కల్పించాయి. ఆయన వెలువరించిన గ్రంథాలను పలు ప్రాంతాల దిన, వార, పక్ష, మాస పత్రికలు ధారావాహికంగా ప్రచురించాయి, ప్రచురిస్తున్నాయి. ఈ గ్రంథాలలో 'పండిత రాంప్రసాద్ బిస్మిల్- అష్ఫాఖుల్లా ఖాన్', గాంధీజీ ప్రాణరక్షకుడు ః బతఖ్ మియా అన్సారీ, మహాత్మాగాంధీ ః ముస్లిం సహచరులు-అనుచరులు గ్రంథాలు తెలుగు, ఆంగ్లం, ఉర్దూ, హిందీ భాషల్లో ముద్రించి భారతదేశ వ్యాప్తంగా వివిధ ప్రాంతాలలోని వ్యవస్థలకు, వ్యక్తులకు ఉచితంగా వేలాదిగా పంపిణి అయ్యాయి. తెలుగు-ఆంగ్ల భాషల్లో 2014లో వెలువడిన 'చరితార్థులు' ఆల్బమ్ జాతీయంగా, అంతర్జాతీయంగా విశేష ఆదరణ పొంది 2019లో తమిళభాషలో కూడా వెలువడింది. 'చరితార్థులు' ఆల్బమ్ ప్రస్తుతం ఉర్దూ, మళయాలం, హిందీ, గుజరాతి, మరాఠి భాషల్లో వెలువడనుంది. ఈ గ్రంథాల పిడియఫ్ ఫైల్స్‌ను అసంఖ్యాక పాఠకులకు వారి అభ్యర్ధన మేరకు ఉచితంగా అందించారు. అంతర్జాలంలో రెండు ప్రత్యేక వెబ్‌సైట్లు ఏర్పాటు చేయించి పుస్తకాలను ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకునే వీలు కల్పించినందున ఇప్పటి వరకు వేలాది పాఠకులు డౌన్‌లోడ్ చేసుకున్నారు.

ప్రస్తుతం 1.) చరితార్దులు (తెలుగు) / ది ఇమ్మోర్టల్స్ (ఆంగ్లం), 2 భారత స్వాతంత్ర్య సంగ్రామం : ముస్లిం యోధులు–2 భాగం, 3.) చరిత్ర సృష్టించిన ముస్లిం మహిళలు, 4.) మాతృభూమి సేవలో కృతార్థులైన ముస్లిం ముద్దు బిడ్డలు, 5.) దక్షణ భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతఃదాదా అమీర్ హైదర్ ఖాన్, 6.) భారతీయ ముస్లింలు –స్థితిగతులు, 7.) భారతీయ ముస్లిం సమాజం : అపోహలు–వాస్తవాలు గంథ్రాల రూపకల్పనలో నిమగ్నమైయున్నారు.

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల మహోన్నత పాత్రను ప్రజలకు ఎరుక పర్చుతూ గత రెండు దశాబ్దాలుకు పైగా నశీర్ అహమ్మద్ సాగిస్తున్న కృషికి గుర్తింపుగా 1.) 'వి.ఆర్ నార్ల విశిష్ట జర్నలిస్టు అవార్డు' (విజయవాడ, 2004), 2.) 'తెలుగు భాషా పురస్కారం' (గుంటూరు, 2007), 3.) 'డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ ఫెలోషిప్ అవార్డు' (న్యూఢిల్లీ, 2008), 4.) 'అష్ఫాఖుల్లా ఖాన్ స్మారక అవార్డు' (హైదరాబాద్, 2010), 5.) బి.యస్ రాములు పురస్కారం (హైదరాబాద్, 2011), 6.) కవికోకిల చిన సుబ్బయ్య స్మారక పురస్కారం (గుంటూరు, 2012), 7.) సంఘమిత్ర అవార్డు (బుక్ ఆఫ్‌స్టేట్ రికార్డ్స్, హైదరాబాద్, 2013), 8.) 'మాస్టార్‌జీ ఫౌండేషన్ సేవారత్న పురస్కారం', (విశ్వజన కళా మండలి, హైదరాబాద్, 2015), 9.). 'జీవిత సాఫల్యా పురస్కారం' (శ్రీమతి జ్యోతిబాయి పూలే ఎడ్యుకేషనల్, చారిటబుల్ ట్రస్ట్, విశాఖపట్నం, 2016), 10.) 'ఉగాది పురస్కారం' (ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం, 2016), 11.) 'విశిష్ట సేవాపురస్కారం' (నరసరావుపేట కళావేదిక, 2016), 12.) జనోపకారి ఆత్మీయ పురస్కారం (జనోపకారి మాసపత్రిక, కావలి, 2016), 13.) ప్రౌడ్ ఆత్మీయపురస్కారం (హైదరాబాద్ 2016), 14.) లోక్ బంధు సద్భావనా సమ్మాన్ జాతీయపురస్కారం (లక్నో, ఉత్తరప్రదేశ్ 2017), 15.) 'కీర్తి పురస్కారం' (పోట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ 2015), 16.) 'మహారాష్ట్ర బుక్ ఆఫ్ రికార్డ్స్'(కవితాసాగర్ పబ్లికేషన్స్, జయసింగ్‌పూర్, మహారాష్ట్ర, 2018.), 17.) 'సృజన ప్రియ పురస్కారం'. (సృజనప్రియ మాసపత్రిక,హైదరాబాద్, 2018). 18.) 'డాక్టర్ పట్టాభి ప్రతిభా పురస్కారం' (డాక్టర్ పట్టాభి కళాపీఠం, విజయవాడ, 2018), 19.) రాష్ట్రస్థాయి ఉత్తమ తెలుగు జర్నలిస్టు అవార్డు (కడప, 2018), 20.) 'మాటి రతన్ పురస్కారం–2018' (అష్ఫాఖుల్లా ఖాన్ స్మారక అమర వీరుల పరిశోధనా సంస్థ, ఫైజాబాద్, ఉత్తరప్రదేశ్, 2018). 21.) 'గిడుగు రామమూర్తి సాహితీ పురస్కారం' (గిడుగు రామమూర్తి పంతులు ఫౌండేషన్, హైదరాబాద్, 2019), 22.) 'సురా సాహిత్య, సామాజిక సేవా పురస్కారం' సావిత్రిబాయి పూలే ఎడ్యుకేషనల్ అండ్ ఛారిటబుల్ ట్రస్టు, విశాఖపట్నం, 2019), 23.) 'కళా భారతి' పురస్కారం (మదనపల్లి సాహితీ కళా వేదిక' మదనపల్లి, 2019) లభించాయి.

భారత ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల సమాచారాన్ని ప్రజలందరికి అందజేయాలన్న లక్ష్యంతో భారతదేశం అంతటా వివిధ సంస్థల, వ్యక్తుల ఆహ్వానం మేరకు వేలాది సభలు, సమావేశాలలలో పాల్గొని ప్రసంగించారు ఈ చారిత్రక సమాచారాన్ని ప్రధానంగా యువత, విద్యార్థుల ఎరుకలోకి తెచ్చేందుకు స్వాతంత్ర్య సమరయోధుల చిత్రపటాలతో ప్రదర్శనలను ఇప్పటి వరకు మనదేశంలోని వివిధ రాష్ట్రాలలో 32 వరకు ఏర్పాటు చేశారు. గత 22 ఏండ్లుగా రచన– ప్రచురణ–ప్రచార కార్యక్రమాలను నిర్విరామంగా నిర్వహిస్తున్నారు. విద్యార్థులు తమ పుస్తకాలకు అంటించుకునే 'నేమ్ స్టికర్లు', క్యాలెండర్లు, స్వాతంత్ర్య సమరయోధుల వివరాలతో చిరు పొత్తాలను, విజిటింగ్ కార్డులను మిత్రులు, వివిధ సంస్థల సహాయ సహకారాలతో ముద్రించి ఉచితంగా పంపిణి చేశారు.

సయ్యద్ నశీర్ అహమ్మద్ రచయిత, నటుడు, చిత్రకారుడు, వ్యంగ్యచిత్రకారుడు, వక్త, సంపాదకుడు, పాత్రికేయుడు, న్యాయవాది, చరిత్రకారుడు, సామాజిక సేవాకార్యకర్తగా వివిధ రంగాలకు సేవలు అందిస్తున్నారు. అంతర్జాతీయ – జాతీయ– ప్రాంతీయ సభలు, సమావేశాలు, సదస్సులలో పాల్గొంటున్నారు. ఆర్థిక–సామాజిక అసమానతలు లేని లౌకిక, ప్రజాస్వామ్య వ్యవస్థ నిర్మాణంలో రచయితగా తన భాగస్వామ్యం అందించడం, జ్ఞానం ప్రజాస్వామీకరించబడాలన్న ఆకాంక్షతో అవిశ్రాంతంగా రచనా వ్యాసంగం సాగిస్తున్నారు.

**– ప్రచురణకర్తలు**

